ఆద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడుగారిచే

ప్రకటితము : రాజమహేంద్రవరము

1934—8377—1

దీని వెల

౦—౧౨—౦

# ఉదంకుఁడు

( మొదటి భాగము )

గ్రంథకర్త:

మండపాక పార్వతీశ్వరశాస్త్రి

బి. ఏ., యల్. టి.



సరస్వతీగ్రంథమండలి

రాజమహేంద్రవరము

# ఉదంకుఁడు

## మొదటి ప్రకరణము

### అనేకత్వము

"ఏమి వాలఖిల్యా! ఏల యింతసాహసము? నీకుఁ దగినట్లు చిన్నసమిధలు రెండు కట్టగట్టి నెత్తిపైఁబెట్టుకొని మోచికొని పోఁగూడదా? ఇంతపెద్దమోపు మోచికొనిపోఁగలవా? ఇట్టిసాహస మేలచేసెదవు?" అని ఆంగిరసుఁడు గర్వముతోఁ బలికెను. వాలఖిల్యుఁ డించుకకోపము తెచ్చుకొని, "ఛీ! నోరుమూయుము. ఈగర్వమే మీయాంగిరసులఁగొంప తీయుచున్నది. నేను పొట్టివాఁడనని మాటిమాటికిని నీవు నన్నధిక్షేపించుచుందువు. ఇదివర కెన్నియోసారులు నిన్ను క్షమించితిని. ఇప్పుడుఁగూడ క్షమింతును. కాని యిఁకముందు మఱిక్షమింపను సుమా. తరువాత విచారించిన ప్రయోజనము లేదు." అని వాలఖిల్యుఁడు సగర్వముగనే ప్రత్యుత్తరమిచ్చెను. "ఓహో! క్షమింపఁడఁట! క్షమింపక యేమిచేసెదవు?" అని ఆంగిరసుఁడు మరల గర్వముతోనే ప్రశ్నించెను. వాలఖిల్యుఁ డాంగిరసునివైపు కోపముతోఁ జూచుచు, నేమియో పలుకఁ

బోవుచుండెను. కాని ఉదంకుఁడడ్డువచ్చి, "నీవూరకుండుము. వాలఖిల్యా! నేను జబాబు చెప్పెదను. ఆంగిరసులకు భార్గవులే సమాధానము చెప్పవలెను. ఆంగిరసా! వాలఖిల్యుఁ డేమి చేయునో నేఁజెప్పెదునా? మీ ప్రభువగు దేవేంద్రునకు పూర్వము వాలఖిల్యు లేమిచేసిరో మీనాయనగారి నడిగి తెలిసికొమ్ము. పొట్టివారని మీరును మీ ప్రభువులును వాలఖిల్యులనుఁ దఱచుగా నధిక్షేపించుచుందురు. పొట్టివారైననేమి, పొడుగువారైననేమి? తపోబలమును విద్యాబలమును బ్రాహ్మణులకు ప్రధానములుగాని శరీరబలమున నేమున్నది!" అని సగర్వముగానే ఆంగిరసునకు బదులుచెప్పెను.

"ఓహో! పెద్దబ్బాయిగారా? పెద్దబ్బాయిగారు మొద్దబ్బాయిగారు! ఉదంకా! నీవు భార్గవుఁడవుగనుక, భార్గవుఁడు చెప్పవలసినట్లే చెప్పితివి. రాక్షసులయొద్ద నేవియో తెలిసియుఁదెలియని మాటలాడి కాలక్షేపము చేయుభార్గవులకు, దేవగురువులగునాంగిరసులమహిమ యెఱుకపడునా? ఓహో! పెద్దబ్బాయిగాఁడఁట! ఆంగిరసుల నధిక్షేపించునఁట." అనిఆంగిరసుఁడు సగర్వముగనే మాఱుపల్కెను.

ఉదంకుఁడు చిన్నవోయి, కోపము తెచ్చుకొని, "పెద్దబ్బాయి, పెద్దబ్బాయి" అని పలుమారుచ్చరించుచుండెను. ఆమాట యాతనికి హృదయశల్యమయ్యెను. శరీరమంతయును వణఁకుచుండెను. నోట మాటరాకుండెను. క్రోధమును విచా

రమును, మనస్సునఁ బెనఁగొనుచుండెను. కాశ్యపుఁడు "బ్రాహ్మణానా మనేకత్వమ్" అని తనలోఁ దాను పైకి వినబడునట్లుగానే యనుకొనుచుండెను. "నిజము కాశ్యపా! నిజము. ఈయనేకత్వమే బ్రాహ్మణులకు నాశహేతువగుచున్నది. ఎంతతపోబలమున్న నేమి? ఎంతవిద్యాబలమున్న నేమి! అంతయును వ్యర్థమే యగుచున్నది." అని వాసిష్ఠుఁడు కాశ్యపుని మాటలకు సమాధాన మొసఁగి వారిప్రసంగమును ముగించనెంచి యిట్లనెను. "సోదరులారా! మన కేల యీవిప్రారణవాగ్యుద్ధము? మనపూర్వులలోఁ గొప్పవారు కానివారెవ్వరు? వారిగొప్పతనము చెప్పుకొనుచు మనలో మనమిప్పుడు కొట్లాడుకొనుచున్నందునఁ గలుగులాభమేమి? ఈగౌతమాశ్రమమున మనము విద్యనేర్చుకొనుటకు వచ్చినాము. మనమందఱ మన్నదమ్ములము. అన్నదమ్ములవలె నైకమత్యముతో నుండి, జగన్మంగళకరములైన కార్యములు చేయవలసినమార్గములు గురువులయొద్ద నభ్యసించి, గురుకులవాసము పూర్తి చేసికొని, స్వాశ్రమములకు మరలిపోవుట యుచితముగానిఁ మన కేల యీవైరములు! బాల్యమునందు నాఁటుకొన్న విరోధబీజములు భావిచరిత్ర యంతయును గళంకయుక్తముగా జేయును. కావున మీవిరోధము లింకఁజాలింపుఁడు. మధ్యాహ్నము కావచ్చినది. గురువులు మనకై వేచికొని యుందురు. పదండు. పోదము."

అంతటను "నిజమే, నిజమే" యని యెవరి మోపును వారు నెత్తిపైఁబెట్టుకొని బయలుదేరిరి. ఉదంకుఁడొక పెద్దమోపును నెత్తిపైఁ బెట్టుకొని, వారివెనుకనే పోవుచుండెను. దారిలో నెవ్వరు నెవ్వరితోను మాటాడలేదు. ఉదంకుఁడు మాత్రము "పెద్దబ్బాయి, పెద్దబ్బాయి" అని గొణుగుకొనుచుండెను. కోపము శాంతించెను గాని క్రోధశోకరసములస్థానమంతయును శోకమేయాక్రమించెను. అరణ్యామును వీడి, యాశ్రమమునుఁ జేరి యెవ్వరిమోపును వారు దించి, యన్నియునుఁ గూడఁదీసి, మాధ్యాహ్నికకృత్యములాచరింపఁబోయిరి.

తన తలపైనున్న మోపు మిక్కిలి బరువుగలదగుట చేతనో, లేక, విచారము వలనగలిగిన నీరసముచేతనో, ఉదంకుఁడు తనమోపును మెల్లఁగ దించుకొనలేక నేలపై నెత్తివైచెను. మోపు నేలపైఁబడునప్పు డాతనితలనున్న వెంట్రుక యొకటియూడి మోపుపై స్పష్టముగఁ గన్పడుచుండెను. తెల్లగానున్న యా వెంట్రుకను జూచినతోడనే కన్నుల నుండి నీరు జలజలరాలజొచ్చెను. "పెద్దబ్బాయి, పెద్దబ్బాయి" యని యాతఁడు గొణుగుకొనుచుఁ గన్నీరు కార్చుచుండెను. గురుపుత్రియగు గౌతమి వడివడిగా నాతనియొద్దకుఁబోయి దోసిలిఁబట్టి యాతనికన్నీటితో నాదోసిలి నింపుచుండెను. కన్నీళ్లు మిక్కిలి వేడిగానుంటచే నావేడి భరింపలేక గౌతమి

నీరు నేలనుజార్చి, మునల దోసిలియొగ్గి నిలుచుండెను. అది యంతయును దూరమునుండి కనిపెట్టుచున్న గౌతముఁడు వారి సమీపమునకు వచ్చి "ఏమి, యుదంకా! ఏలయేడ్చుచున్నావు?" అనియడిగెను. "పెద్దబ్బాయిని, పెద్దబ్బాయిని" అని యుదంకుఁడు గోణిగెను కాని మఱేమియుఁ జెప్పలేదు.

"అవును నిజమే. యుదంకా! నిజమే. అరణ్యములో జరిగిన దంతయు నాకుఁ దెలిసినది. తప్పు నాదే. చాలకాలము నిన్ను గురుకులవాసమున నుంచితిని. నీకు గృహస్థాశ్రమముపై నెప్పుడు దృష్టిగలిగిన నప్పుడు నిన్నుఁ బంపివేయవలెనని యను కొనుచుంటిని. కాని నేటివరకు నీకాదృష్టి కలుగలేదు. ఇఁక నీవు గృహస్థాశ్రమము స్వీకరింపవచ్చును."

"స్వామి! యిప్పుడు నాకేటిగృహస్థాశ్రమము? తల నరసిపోయినది. నాకుఁ బిల్లనిచ్చువారెవ్వరు? నాజీవనము వ్యర్థమైనది. నాకిఁకనేమియు నక్కఱలేదు. తమపాదముల యొద్దనే యేడ్చుచుఁ బడియుందును."

"అట్లనకుము. ఉదంకా! నీకు నేనుఁ బిల్లనిత్తును. నీవు మహాతపస్సంపన్నుఁడవు. చాలకాలము గురుకులవాసముచేసి నీవు గొప్పతపోబల మార్జించితివి. నీ తేజస్సును మఱియొకస్త్రీ భరింపలేదు. నాకుమార్తెయైన యీ గౌతమియే భరింపఁ గలదు. కావున ఆమెను బెండ్లాడుము."

"స్వామీ! ఒకజీవమునకై మఱియొకజీవమునుకూడ వ్యర్థము చేసెదరా? పన్నెండేండ్ల పనసపండువంటి మీపిల్లను, తల నెరసిపోయిననాకుఁ బెండ్లిచేసి, యామెజీవితముకూడ వ్యర్థముచేయవద్దు. నాకుఁ బెండ్లియక్కఱలేదు." అని యుదంకుఁ డేడ్చుచునే పలికెను.

"ఏమియట్లందువు. ఉదంకా! తలనరిసిననేమి? నిన్ను నేను నవయౌవనవంతునిగాఁ జేయఁగలను. మీభార్గవులకు, మాగౌతములకును ప్రియస్నేహితులగు అశ్వినులుకలరుగదా. వారినిరావించి, నిన్ను నవయౌవనవంతునిగాఁ జేయించెదను."

"వారికి నేనేమి ప్రత్యుపకారము చేయఁగలను." అని యుదంకుఁ డనెను.

"ఏమియు నక్కరలేదు. అశ్వినులు మీ పూర్వులవలనఁ బొందినయుపకారమే చాలును. మీ పూర్వుఁడైనచ్యవనుఁడు ఇంద్రునితో సమముగా అశ్వినులకు హవిర్భాగము లిప్పించెను. అదియిప్పటికిని జరుగుచున్నది. ఇది వారెన్నటికిని మఱవఁజాలరు. కావున నేనుగోరినచో, వృద్ధుఁడైనచ్యవనునివలెనే నిన్నును వారు నవయౌవనవంతునిగాఁ జేసెదరు." అని గౌతముఁడు వచించెను.

"అట్లయినఁ దమచిత్తము." అని యుదంకుఁడు వచించెను.

"నేఁడే వారిని బిలిపించెదను. నీమాధ్యాహ్నికములను దీర్చుకొనుము. వేళ యైనది. పొమ్ము." అని చెప్పి గౌతముఁడు ఇంటిలోనికిఁ బోయెను. ఉదంకుఁడు సెలవుతీసికొని మాధ్యాహ్నికములు నిర్వర్తించుకొనఁబోయెను.

---

# రెండవ ప్రకరణము

## గౌతమాశ్రమము

భారతవర్షమునఁ బ్రాచీనకాలమున మహర్షులయాశ్రమములే విద్యాపీఠములు. చిరకాలగురుకులవాసమున విద్యాభ్యాసమొనర్చి గృహస్థాశ్రమము స్వీకరించి, బ్రాహ్మణుఁడు తనకుచితమగుతావున నొకయాశ్రమము నిర్మించుకొనును. అందుఁ దనకును దనశిష్యులకును గొన్నిపర్ణశాలలు నిర్మించుకొనును. ఆయాశ్రమమునకు నాలుగుజాతులవారును, ధనికులు దరిద్రులు, రాజులు రెడ్డు లనుభేదములులేక, యందఱును దమబిడ్డల నంపుదురు. ఆశ్రమాధికారియైనఋషి ధర్మపత్నీసహితుఁడై కందమూలాదులను భుజించుచు, వల్కలాజినములను ధరించుచు, శిష్యులకుఁ దత్తజ్జాత్యుచితవిద్యాతపోవిధానముల నధ్యాపనము చేయుచుండును. గురుకులవాసముననున్నంతకాలమును శిష్యుఁడేజాతివాఁడైన, గురువులకుఁ బరిచర్యలు సేయుచుఁ, గందమూలాదుల భుజించుచు, బ్రహ్మచర్యమతినియమముతో నిర్వహించుచుండును. గురుకులవాసము పూర్తియైనదని గురువులకుఁ దోఁచినప్పుడుగాని, లేక, గృహస్థాశ్రమము స్వీకరింపవలెననుబుద్ధి శిష్యునకుఁ గలిగినప్పుడు

గాని, శిష్యుఁడు గురువుల యనుజ్ఞవడసి, గురుకులమునువీడి, తనయింటికిఁ బోయి గృహస్థాశ్రమమునఁ బ్రవేశించును.

ప్రాచీనకాలమున భారతవర్షమున నిట్టివిద్యాపీఠము లెల్లతావుల నిండియుండుటచే, జాత్యుచితవిద్యాగంధము లేని వారరుదుగనుండిరి. విద్యార్జనము ధనవ్యయముచేఁగాక కేవల శ్రద్ధమాత్రముననే కలుగుచుండుటచే, గురుభక్తియును, శిష్య వాత్సల్యమును, పరస్పరానుకూల్యములై, దేశోద్ధారకములై యుండెను. అధ్యయనాధ్యాపనములే ప్రధానవృత్తులుగాఁ గలిగి, కందమూలాదులు భుజించుచు, జటావల్కలాజనములు ధరించుచుఁ, బర్ణశాలలో నివసించుచు బ్రాహ్మణులు తమ విద్యాబలమును, దపోబలమును, మనోబలమును, లోకోద్ధ రణకై వినియోగించుచుండిరి. పక్షపాతములేక, తత్తజ్జాత్యు చిత విద్యావిధానములు నిర్ణయించి, బోధించి, యారితేరిన శిష్యులను గృహస్థాశ్రమ స్వీకరణమునకై విడుచుచుండిరి. స్వలాభ మణుమాత్రమైనలేక, కేవలములోకోద్ధరణమునకై మాత్రమే తమశక్తిసామర్థ్యములను వినియోగించుచున్నంత కాలమును బ్రాహ్మణులు భారతవర్షమున నగ్రగణ్యులై యుండిరి. భారతవర్షము లోకమునఁగల యన్నివర్షములలో నగ్రగణ్యమై యుండెను. ఏనాఁడు బ్రాహ్మణులు తమకులో చితములగు నధ్యయనాధ్యాపనములు విడిచిరో, ఏనాఁడు బ్రాహ్మణులు కులోచితములుకాని లౌకికోద్యోగములలోఁ

ప్రవేశించి ధనార్జన మారంభించిరో, యానాఁడే బ్రాహ్మణ జాతికి నధఃపతన మారంభమైనది. భారతవర్షమునకుఁగూడ నధఃపతన మారంభమైనది. కావున విద్యాపీఠములైన బ్రహ్మర్షులయాశ్రమములే ప్రాచీనభారతవర్షౌన్నత్యమునకు మూల పీఠములు.

అట్టి విద్యాపీఠములు మొట్టమొదట కశ్యపాదులగు సప్తర్షులు నందందు స్థాపింపగా, వారిశిష్యులును, వారిసంతతి వారును, నెవ్వరికిఁదోఁచినతావున వారు తమతమయాశ్రమములను నిర్మించుకొనుచున్నందునఁ గొంతకాలములో భారతవర్షమున నేమూలఁజూచిన నేదోయొక మహర్షి యాశ్రమము కన్పట్టుచునేయుండెను. అట్టి యాశ్రమములలో గౌతమాశ్రమమొకటి ప్రధానమైనదిగానుండెను.

గౌతముఁడు చాల ప్రఖ్యాతిగాంచినమహర్షి. అతని భార్యయైన యహల్య మహాపతివ్రతయై పతిసేవయును శిష్య సంరక్షణమునుఁ జేయుచు, పతిశిష్యుల సంభావనకుఁ బాత్రయై యుండెను. కాశ్యపాంగిరస భార్గవవాలఖిల్యాదులైన మహర్షుల బిడ్డలు గౌతమాశ్రమమున విద్యనేర్చుకొని, సముచితకాలమున గురుకులము విడిచి గృహస్థాశ్రమము స్వీకరించుచుండిరి. భృగువంశసంభూతుఁడైనయుదంకుఁ డట్టిశిష్యులలో నొకఁడు.

ఎందఱోశిష్యులు వచ్చుచుఁ బోవుచుండిరిగాని, ఉదంకుఁడు గురుకులము విడువఁడయ్యెను. తాను బహుభక్తిశ్రద్ధ

లతోఁ బరిచర్యలు సేయుచుండుటచే గురుపత్ని యాతని విడువలేకుండెను. ఎంతటికష్టసాధ్యములైన తపోవిధానముల నాతనికి గురువు లుపదేశించుచున్నను, విసుగుకొనక, కష్టమనక, నిర్వహించుచుండుటచే గురువులాతని విడువలేకుండిరి. కావునఁ దననిజగృహమునుగూర్చి యుదంకుఁడు మఱచి పోయి, గురుకులమునఁ దన్మయుఁడై యుండిపోయెను. నలువదియేండ్లయీడు వచ్చినది. తల నరయుచున్నది. కాని పెండ్లియాడు సంకల్ప మాతనికిఁ గలుఁగలేదు.

నాఁటియుదయమునఁ దనసహాధ్యాయులకును దనకును జరిగినసంభాషణవలన నుదంకునియందుఁ దీవ్రమైనయొక మార్పు కనఁబడినది. పెద్దబ్బాయి యన్నమాట శల్యమువలె నాటుకొన్నది. నరసినవెండ్రుక కంటఁబడి గుండెనీరుచేసినది. అప్పుడు తానాయాశ్రమమునందలి యొకశిష్యుఁడనియుఁ దనకు వేఱొకయాశ్రమమున నొకయిల్లును, దల్లిదండ్రులును, అన్నదమ్ములును గలరనియుఁ దానుగృహస్థాశ్రమము స్వీకరింపవలసినవాఁడనియు, ఆదాశ్రమము స్వీకరింపవలసినవయస్సు తనకు మించినదనియుఁ బొడకట్టినది. తనబ్రతుకంతయు వ్యర్థమైనదని యాతఁడనుకొనెను. కాని గౌతముఁడు నాఁటిసాయంకాలములోపుననే, యాశ్వినుల బిలిపించి, వారికటాక్షమువలన నాతని నవయౌవనవంతుని గావించి, తనకుమార్తె నాతనికిచ్చి పెండ్లిచేయనిశ్చయించి, స్నాతకవ్రతము చేసికొమ్మనెను.

బహుకాలము గురుకులవాసముచేయుటచే నేను గురువులకుఁజాలఋణపడియున్నాను. గురుకట్నము నావలన మీరు స్వీకరించినఁగాని నేను గృహస్థాశ్రమమునఁ బ్రవేశింపనని యాతఁడు పట్టుపట్టి చెప్పెను. గౌతముఁడు కట్నముపుచ్చుకొనుట కెంతమాత్రము నంగీకరింపలేదు. కాని ఉదంకుఁడు పెద్దపట్టు పట్టి యుండుటచే నహల్యయెట్టకేలకాకట్నము పుచ్చుకొనుట కంగీకరించి మదయంతియొద్దనున్నకుండలములను దెచ్చి తన కిమ్మనికోరెను. "అదిచాలకష్టమైనపని. అట్టిపనిలో నాతని ప్రవేశపెట్టవద్దు" అని గౌతముఁ డాపనికంగీకరింపలేదు.

"భయములేదు. ఎంతకష్టమైన భరియించి నేను కుండలములు తెచ్చితమకిచ్చెదను. మీరాశీర్వదించి పంపినచో, నేను చేయలేనికార్యములేదు." అనియుదంకుఁడు ధైర్యముతోఁ జెప్పెను.

"అట్లైన నీయిష్టము. పొమ్ము. వేగము రమ్ము" అని గౌతముఁ డాతనికిఁ బో ననుజ్ఞయిచ్చెను, గాని, లోలోన విచారించుచుండెను.

"ఏలనీకీపట్టుదల ? నిష్కారణముగ నాతనిఁ గష్టపెట్టుచున్నావు." అని గౌతముఁడు విచారించుచు భార్యతోననెను.

"మీరు దయతలచినచో నుదంకునకుఁ గష్టమేలకలుగును." అని యహల్య బదులుచెప్పెను.

“నిజమే, కాని, నాతపస్సు కొంతయిప్పుడు వ్యయము చేయవలసియున్నది.” అని గౌతముఁడని “సరే, కానిమ్ము” అని తన్నుదాను సమాధానపఱచుకొనెను.

---

# మూఁడవ ప్రకరణము

## వశిష్ఠ విశ్వామిత్రులు.

చంద్రవంశ సంభూతుఁడైన విశ్వామిత్రుఁడను మహారాజు, కన్యాకుబ్జము రాజధానిగా భూపరిపాలన మొనర్చుచుండెను. ఒకానొకదినమున నాతఁడు వేటకుఁ బోయి, చాల ప్రొద్దెక్కువరకును వేటాడి యలసిపోయి, మృగము నొకదానిని వెంబడించి, త్రోవతప్పి, యొకఋష్యాశ్రమమునఁ బ్రవేశించెను. అది వశిష్ఠాశ్రమమని తెలిసికొని, లోనికిఁబోయి, వశిష్ఠునివలన స్వాగతసత్కారములంది కూర్చుండి విశ్రమించెను. మహారాజు తనయింటికి నతిథిగావచ్చుటచే నాఁటిదిన మనధ్యయనదినముగాఁజేసి, శిష్యులను విడిచిపెట్టి, తనయాశ్రమమున విందుగుడిచి పోవలసినదని వశిష్ఠుడు మహారాజును బ్రార్థించెను.

విశ్వామిత్రుఁడు పర్ణశాల నాల్గుమూలలును జూచి, యందు భోజనమునకుఁ గావలయుపదార్థము లేమియుఁగను పడకుంటచే "మునీంద్రా! తాము నాకిప్పుడుచేసినసత్కారమే చాలును నేనొక్కఁడనే రాలేదు. నాతోఁ జాలపరివారము కూడ వచ్చియున్నది. పరివారమునువిడిచి నేనొక్కఁడనే

విందారగించుట రాజధర్మము కాదు. నా పరివార మిప్పుడే వచ్చెదరు. వారితోఁ గలసి మా యూరికిఁ బోయెదను కావున, క్షమించి నన్ను విడిచిపెట్టుఁడు.'' అని విశ్వామిత్రుఁడు వేఁడుకొనెను.

మహారాజుగారి యుద్దేశమును మహర్షి గ్రహించి, "రాజేంద్రా! మీ కేమియు ననుమానము వద్దు. మీరును మీ పరివారమును యథేచ్ఛముగా భుజింపవచ్చును. మహర్షుల విందులను మేషయుద్ధాదులతోఁ జేర్చిన పూర్వకాలపున్యాయమును దలంచి మీరు సందేహించుచున్నారేమో. అట్టిసందేహము వలదు. మీరును మీ పరివారమును దృప్తితీరఁ దినవచ్చును. ఆలస్యము కూడఁ గాదు. మీ పరివారము వచ్చిన రెండున్నర ఘడియల (1 గంట)లోనే యంతయును సిద్ధమగును." అని వసిష్ఠుఁడు నిరోధించెను.

బ్రహ్మర్షియైన వశిష్ఠునియందాతనికిఁ గల గౌరవము చే, మారుమాటాడలేక 'చిత్త'మని రాజంగీకరించెను. కాని మహారాజునకు సందేహము బాయలేదు. "ఏమి జరుగునో చూచెదము" అని రాజు నిరీక్షించుచుండెను.

పరివారము వచ్చినది. వంటప్రయత్నము లారంభము కాలేదు. వంటచేయు మనుష్యులు కూడ నెవ్వరును గనుపడలేదు. ఆశ్రమమున ముక్కులు బిగించుకొని కూర్చున్నవారును, లోలోన నణఁగుకొనుచున్నవారును, పద్మాసనము వేసికొని

కూర్చున్నవారును, నేలపై సాగిలపడుచు లేచుచున్నవారు నై యుండిరి గాని వంటకు మడిగట్టుకొన్న వారెవ్వరును లేకుండిరి. త్రేతాగ్ని లౌకమూలనున్నవి గాని పాకాగ్ని యెక్కడను గన్పడలేదు.

పరివారమువచ్చినయొక రెండు మన్న రఘడియలలో సరిగా, వశిష్ఠుఁడు జపము పూర్తిచేసికొని, మహారాజును సమీపించి "అంతయును సిద్ధముగానున్నది. క్షణములో వడ్డన పూర్తి యగును." అని రాజుతోఁ జెప్పెను.

కాని విశ్వామిత్రుఁడు నమ్మలేఁడు; నమ్మకపోలేఁడు; మాటాడలేఁడు; మాటాడకపోలేఁడు. అందఱును బంతులు సాగి కూర్చుండిరి. శిష్యులు విస్తరాకులను వేసిరి. వశిష్ఠుని హోమధేనువు పంక్తులనడుమనుండి యొక్కసారి నాల్గువైపులును దిరిగిపోయెను.

వశిష్ఠుడువచ్చి "రాజేంద్రా! ఆరగింపుఁడు. మీకమృతమస్తు" అని భోజనముచేయుట కనుజ్ఞయిచ్చెను.

రాజునకును పరివారమునకును, మిక్కిలి యాకలి యగుచున్నది. విస్తరాకులువట్టివే యెదుటఁ గన్పడుచున్నవి. మహర్షి భోజనము చేయుమనుచున్నాఁడు. హాస్యమా, పరియాచకమా, ద్రోహమా, యని వింతయును, గోపమును, భయమును, ముప్పిరి గొనుచుండెను.

"ఇంకను భోజన మారంభింపరేమి" అని వశిష్ఠుఁడు మరియొకసారి తొందరచేయునప్పటికి, ఎదుట షడ్రసోపేతము లైనచతుర్విధాన్నములతో భోజనపత్రములు నిండియుండెను. భోజనములారంభించిరి. హోమధేనువు పంక్తులనడుమఁ దిరుగుచుండెను. ఏయేపదార్థము లెవ్వరికిఁ గావలసియుండెనో ఆయాపదార్థములు వారివారికిఁ బ్రత్యక్షము లగుచుండెను. అందఱును దృప్తిదీర భుజించిరి. అదియంతయును ధేనుమహిమయే యని యందఱు ననుకొనుచుండిరి. భోజనములన్నియును బూర్తియైనవి. వశిష్ఠవిశ్వామిత్రు లిష్టగోష్ఠిలోనుండిరి.

కొంతసేపైనతరువాత విశ్వామిత్రుఁడు, "మునీంద్రా, మీకుఁ గోపమురాకున్న నాదొకమనవి కలదు." అనిమెల్లగా ననెను.

వశిష్ఠుఁడు గ్రహించి, నవ్వి, "కోపమేల ? నీవు చెప్ప దలఁచుకొన్నది చెప్పవచ్చును." అనెను.

"మీకు లక్షధేనువుల నిచ్చెదను. మీహోమధేనువును నాకిచ్చివేయుఁడు."

"ఒకచిన్నయావునకై యింతధన మేలవ్యయము చేసికొందువు? ఇంతేకాక, అది నీకిచ్చుటకు వలనుపడదు."

"నారాజ్యములో సగము మీకిచ్చివేసెదను. నాకా ధేనువు నిచ్చివేయుఁడు."

"ఏమిచేయుదును వలదు. అరుంధతి యాకస్త్రిని జాల ముద్దుగాఁ బెంచుకొనుచున్నది. నీరాజ్యముతో, నీధేనువులతో నాకేమి పని యున్నది? నాముద్దులయావును నేనియ్యఁజాలను క్షమింపుము."

విశ్వామిత్రునకుఁ గోపము వచ్చెను. "మహారాజు మాటకు వ్యతిరేకముగాఁ జెప్పెదవా? ఏమి యీబడుగు బ్రాహ్మణుని కావరము! నీవు మృదువుగా నీయకున్న బలవంతముగా నీయాశ్రమమునుండి తీసికొనిపోయెదను. జాగ్రత్త." అని విశ్వామిత్రుఁడు కోపముతోఁ బల్కెను.

"సరే, నీకుశక్తియున్న, నట్లేతీసికొనిపొమ్ము; నాకేమియు నభ్యంతరములేదు." అని వశిష్ఠుఁడు, శాంతముగ బదులుచెప్పెను. విశ్వామిత్రుఁడు హుంకారమొనర్చి, పరివారమునకుఁ గనుసన్న చేసెను. రాజుగారికనుసన్న యెఱిఁగి పరివారములోఁ గొందఱు వశిష్ఠుని సమీపించిరి. బ్రహ్మదండము చేనందుకొనుటకై మహర్షి ప్రయత్నించెను. గాని, యది కొంచెము దూరముగానుండెను. అది యందుకొనఁబోవులోపుననే, కొందఱు రాజభటులు వశిష్ఠుని రెక్కలువెనుకకుఁద్రిప్పి పట్టుకొని త్రాళ్లతో నాతనిఁ గట్టివైచిరి. మఱికొందఱుభటులు తెలుపుటనున్న హోమధేనువును బట్టుకొని త్రాళ్లతోఁ గట్టి, లాగుచుండిరి. ఆవు ముందుకుఁబోక, దీనముగా వశిష్ఠునివైపు చూచుచుండెను.

"నాయనా, యేమిసెలవు" అని ధేనువడుగుచున్నట్లుండెను. "నాబిడ్డా, నాకిప్పుడు చేతులులేవు. నీవు లోకమాతవు. నీకుఁ దోఁచినట్లుచేసి, నిన్నును, నీబిడ్డలను, నన్నును నాబిడ్డలను గాపాడుము." అని వశిష్ఠుఁడానతిచ్చెను.

హోమధేను వొక్కమా "రంబా" యని యఱచెను. వెంటనే, ఆయుధపాణులైన వీరులు, శక, యవన, మ్లేచ్ఛ, కిరాతాదులు వేలకొలఁదిగ నాల్గుమూలలనుండి పరువెత్తికొని వచ్చి, విశ్వామిత్రుని పరివారముపైఁ బడిరి.

"బిడ్డలారా! జీవహింసమాత్రము చేయఁబోకుఁడు." అని వశిష్ఠుఁడాజ్ఞాపించెను. మ్లేచ్ఛసైన్యములు రాజసైన్యముల పైఁబడి భయపెట్టి వారిని బారఁదోలెను. వసిష్ఠధేనువుకట్లు విప్పివైచిరి. బ్రతుకుజీవుఁడా, యని విశ్వామిత్రుఁడును బరివారమును బ్రాణము లఱచేతఁ బెట్టుకొని, యెక్కడివారక్కడ చెల్లాచెదరై పారిపోయిరి.

విశ్వామిత్రుఁడెట్లో తనయింటికిఁ బోయెను. కాని, యీయవమానము నాతఁడు భరింపలేకుండెను. వశిష్ఠునెట్లు సాధింపవచ్చునని రేయుంబవళ్లాలోచించుచుండెను.

---

# నాలుగవ ప్రకరణము

## ప్రష్టర్షి.

వశిష్ఠుని సాధించుటకుఁ దగినమార్గమేదియును విశ్వామిత్రునకు గోచరింపలేదు. తనసైన్యము నంతయును దీసికొనిపోయి, వశిష్ఠుని యాశ్రమమును ముట్టడించి, యాతనిఁ బట్టుకొని చెఱయందుంచఁ బ్రయత్నించెను. కాని, ఆప్రయత్నము వలన లాభములేనట్లు తోఁచెను. నాఁడాతని వెంబడించిన మ్లేచ్ఛులను దలఁచుకొన్న గుండెలు బ్రద్దలగుచుండెను. వారి భయంకరాకారములు నిద్దురలోఁగూడ నాతనికిఁ గన్పట్టుచుండెను. అట్టివారెందఱాతనియొద్ద నున్నారో, సైన్యముతోఁ దానుఁబోయినచో, వారందఱును విజృంభించి, తన్నును, దన సైన్యము నేమిచేసెదరో, యని భయపడి, యాప్రయత్నమును మానివేసెను.

"ఈవశిష్ఠుఁడు రుద్రాక్షమాలమువలెఁ గన్పట్టుచున్నాఁడు. లేకున్న, ముక్కుమూసికొని, మూలఁగూర్చుండ వలసిన మునివేషధారికి, ఈ మ్లేచ్ఛసైన్యమేల! అహింసా వ్రతమని పేరుపెట్టుకొన్నజడదారి కీభయంకరాకారులగు ననుచరులేల? ఇదివట్టివేషము. సహాయమైనప్పు డే రాజుపై

నోపడి, వానిని రాజ్యమునుండి తొలఁగించి, తాను రాజ్య మాక్రమించుకొనుటకే, యీయహింసావ్రతమును, ఈమ్లేచ్ఛ సైన్యమును." అని తలపోసి తలపోసి, "సైన్యముతో వీనిని బట్టుకొనలేము కావున, రాత్రి యొంటిగనున్నప్పుడు పట్టు కొనుటకై ప్రయత్నింతును."

ఈయాలోచనము తనహృదయమున స్థిరపడినవెంటనే తనగూఢచారులను బిలిచి, "మీరు మ్లేచ్ఛులవేషములు ధరించి వశిష్ఠాశ్రమమునకుఁ బోయి, యాతఁడర్ధరాత్రమున నొంటరిగా నున్నసమయము కనిపెట్టి నాకుఁ దెలియఁ జేయుఁడు." అని వారికాజ్ఞయిచ్చెను. వారట్లే వశిష్ఠాశ్ర మమునకుఁ బోయి, మ్లేచ్ఛులలోఁ గలసి, వశిష్ఠునిప్రవర్త నలను రహస్యముగాఁ గనిపెట్టుచుండిరి. ఆశ్రమమునకుఁ గొంచెముదూరమున నొక్కమఱ్ఱిచెట్టు గలదు. పెద్దపెద్ద యూడలనేకములు గలిగి, మిక్కిలి విస్తరించి, యావృక్షము చూచుటకుఁ జాలనద్భుతముగ నుండెను. ప్రతిదినము నర్ధ రాత్రమున వశిష్ఠుఁడాచెట్టుక్రిందికిఁ బోయి, యొకపెద్దయూడ ప్రక్కను, పద్మాసనమునఁ గూర్చుండి, బ్రహ్మాండముపైఁ జేయి వైచుకొని, పరమేశ్వరునియందు మనస్సు లగ్నము చేసి, యాయంధకారమున నద్భుతంబైనజ్యోతిస్స్వరూపమును జూచుచు, బ్రహ్మానంద మనుభవించుచుండును. ఆ సమయ మునఁ శిష్యులుకూడ నెవ్వరును సమీపముననుండరు. తానొ

క్కడే యానిర్జనస్థలమున నేకాంతముగఁ గూర్చుండి, తన బ్రహ్మదండమే సహాయముగాఁ జేసికొని, బ్రహ్మానంద మనుభవించుచుండును. "సమం సర్వేషు భూతేషు, తిష్ఠన్తం పరమేశ్వరం, వినశ్యత్స్వ వినశ్యన్తం, యః పశ్యతి సపశ్యతి" అను వాక్యమును యథార్థమును జేయుచుండును; గూఢచారులిది కనిపెట్టి విశ్వామిత్రునియొద్దకుఁ బోయి, యేరాత్రియైన నాతని నొంటిగాఁబట్టుకొనవచ్చునని యాతనికిఁ దెలియఁజేసిరి.

విశ్వామిత్రుఁడు చాలసంతసించి, యొకనాఁటిరాత్రి కొంతపరివారమును దీసికొని, తనయుద్ధపరికరములతో వశిష్ఠుఁడున్నమఱ్ఱిచెట్టునొద్దకుఁ బోయెను. వశిష్ఠుఁ డీసంగతి కనిపెట్టెనుగాని, బ్రహ్మదండముపైఁ జేయియానుకొని కూర్చున్నవాఁడట్లేకూర్చుండి, కదలక మెదలక యుండెను. దీపముల వెలుఁగున విశ్వామిత్రుఁడు వశిష్ఠుఁడున్నస్థలము కనిపెట్టి, దూరమునుండి బాణము లాతనిపై వేసెను. కాని, బాణమేదియును వశిష్ఠునికిఁ దగిలినట్లు కన్పడలేదు. బ్రహ్మాస్త్రమును బ్రయోగించెను. అది బ్రహ్మదండమునొద్దకుఁ బోయి సాష్టాంగ నమస్కారము చేసినట్లు నేలఁబడి యుండిపోయెను. ఆపైని విశ్వామిత్రుఁడు చేయవలసిన దేదియును లేకుండెను. దృఢమైన దీక్షతో నహింసావ్రతము పూనినవానిని, ఎంతబలముగల రాజైన నేమియుఁ జేయలేఁడని యాతనికి ఋజువైనది. వెంటనే యాతఁడక్కడనుండి మరలిపోయెను. తన రాజ్యమును

దనకుమారున కిచ్చివేసి, వింధ్యపర్వతప్రాంతములకుం బోయి, యక్కడ నొకయాశ్రమము నిర్మించుకొని, ఘోరమైనతపస్సు చేయనారంభించెను.

మహాసామ్రాజ్యమును తృణప్రాయముగా విడిచిపెట్టి మహాతపస్సుచేసి విశ్వామిత్రుడు బ్రహ్మర్షియయ్యెను. వింధ్య పర్వతప్రాంతమునం గల యాంధ్రశబరమూతిబాదులలో ననార్యులను కూడం దీసి, యార్యవిజ్ఞానమును వారియందు వ్యాపింపం జేసి, వారిని నాగరికులను జేసి, వారు శిష్యులై తనయొద్దం బరిచర్య సేయుచుండ, బ్రహ్మర్షులలో నగ్రగణ్యుడను ప్రఖ్యాతి నార్జించెను.

బ్రహ్మర్షియనుమహాఖ్యాతిని విశ్వామిత్రుం డార్జించెను గాని, యొక్కవిషయము మాత్ర మాతని విడువలేదు. వశిష్ఠుని దాను సాధింపలేదు. వశిష్ఠుని సాధింపలేక పోయిన తరువాత, తనకుం గీర్తియేల? బ్రహ్మర్షిత్వమేల? ఈకోరిక మొదట బీజరూపముగా నణంగియుండియు, మరల మొలకెత్త నారంభించెను. కొన్నిదినములకది పెద్దచెట్టయినది. ఇంక నశించుటకు వీలులేదు. ఎట్లైన వశిష్ఠుని సాధింపవలెను. వశిష్ఠుడు బ్రహ్మర్షి. తానుకూడ బ్రహ్మర్షిగదా. వశిష్ఠుడు శక యవన పారద పహ్లవాదులయందు, ఆర్యవిజ్ఞానము వ్యాపింపంజేసి, తనబ్రహ్మర్షిత్వము సార్థకము చేసికొనుచుండ, విశ్వామిత్రుడు నాంధ్రశబరమూతిబాదులయం దార్యవిజ్ఞాన

బీజములు నాటి, వారికి నాగరకత యొసంగి తానుఁగూడఁ దన బ్రహ్మత్వము సార్థకముచేసికొనుచున్నాఁడు. అయినను, వశిష్ఠునియం దొకఁయాధిక్యము కలదు. ఆతఁడు సూర్య వంశపురాజునకుఁ బురోహితుఁడును గురువునై, యాతని సహాయమునఁ దన కార్యములను జేసికొనుచున్నాఁడు. విశ్వామిత్రుఁడు తనరాజ్యమును వీడి బ్రహ్మర్షి యగుటచేఁ దనకట్టియాశ్రయ మేదియును లేదు. కావునఁ దాను సూర్యవంశపురాజులకుఁ బురోహితుఁడైనచో, వశిష్ఠుఁ డాశ్రమహీనుఁడై బలహీనుఁడై పోవును. అప్పుడు తానువశిష్ఠునికన్న నన్నివిధముల గొప్పవాఁడగును. ఈయాలోచనము విశ్వామిత్రుని హృదయమున బాగుగ నాఁటుకొని స్థిరపడినది.

విశ్వామిత్రుఁడు తనయాశ్రమమును విడిచి యయోధ్యకుఁ బోయెను. సుదాసుఁడనువాఁడు సూర్యవంశపురాజై యయోధ్యనుండి ప్రజాపాలన మొనర్చుచుండెను. మహాతపస్సుచేసి, క్రొత్తగా బ్రహ్మర్షియై పూర్వపుఁదనక్షత్రియవంశమునకును, ఇప్పటి తనబ్రాహ్మణవంశమునకును గూడ కీర్తి సంపాదించినమహాత్ముఁడు తనయొద్దకు వచ్చుచున్నాఁడని విని, యానందించి సుదాసుఁడు బ్రహ్మర్షికి నెదురుగాబోయి, సాష్టాంగనమస్కారమొనర్చి, తీసికొనివచ్చి తనయర్ధాసనమునఁ గూర్చుండఁబెట్టెను. విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షిత్వము సంపాదించుటకై తానుఁబడ్డశ్రమ యంతయునువర్ణించిచెప్పి

యిప్పటికి బ్రహ్మర్షులుగానున్న గౌతమాదుల తపస్తారతమ్యము లను జర్చించి చూచి, తుదకు వశిష్ఠునిగూర్చి ప్రసంగింప నారంభించెను. ఆప్రసంగమున వశిష్ఠు నెంతయో స్తవముచేసి, చివరకు, వశిష్ఠుఁడన్నివిషయములలో గొప్పవాఁడేగాని, యొక్క లోపము మాత్రమాతనియందుఁ గలదనిచెప్పి, ఆలోపమే లేకున్నచో, వశిష్ఠునివంటిబ్రహ్మర్షి యింకొక్కఁడుండఁడని నొక్కిచెప్పెను.

"బ్రహ్మర్షివర్యా, ఆలోపమేదో సెలవిచ్చెదరా ?"

"ఏమియునులేదు. ఆతనికి శిష్యులనుపేర నాతనియొద్ద శకయవనపారదపహ్లవాదులగు మ్లేచ్ఛసైన్యములెన్నియో కలవు. ఆసైన్యములసాహాయ్యమున నాతని కెవ్వరిలక్ష్యమును లేదు. తుదకు మీాయన్నమును దినుచున్నను, మీాలక్ష్యము కూడ నాతనికి లేదు."

"ఓహో వశిష్ఠుఁడంతవాఁడా! మాలక్ష్యముకూడ లేదా! నేనుస్వయముగాఁబోయి వానిఁ బరీక్షించెదను. నాలక్ష్యములేకుండ వాఁడున్నట్లు కనఁబడినచో, వానిని బురోహితపదవినుండి తప్పించి, మిమ్ము నాకుఁ బురోహితులనుగాఁ జేసికొందును."

"రాజ్యమే విడిచివచ్చిననాకేల, యీారాజ పురోహితత్వము? ఏదోముక్కుమూసికొని యరణ్యమునఁ బడియుండక మరల నాకేల యీాస్వర్థాయాసము."

"ప్రార్థనకేఁదుము. మీరు నాకుఁ బురోహితులుగానుండి, నన్నును, నారాజ్యమును, నాప్రజలను, ఉద్ధరింపుఁడు."

"మీరంతబలవంతపెట్టుచున్నచో వచ్చెదనుగాని, మఱి యొకసారి బాగుగా నాలోచించుకొనుఁడు."

"మీకుఁదప్పదు." అని సుదాసుఁడు నచ్చఁజెప్పి, "పదండు, మనమిద్దఱమును వశిష్ఠాశ్రమమునకుఁ బోదము." అని వానిని దొందరచేసెను.

రథమెక్కి వారిరువురును వశిష్ఠాశ్రమమునకు బయలు దేరిరి.

---

# ఐదవ ప్రకరణము

## శాపము.

వశిష్ఠాశ్రమద్వారమునకు సమీపముగాఁ బచ్చిక పఱుపుపై, శక్తియును నదృశ్యంతియును గూర్చుండిరి. శక్తి మహాముని వశిష్ఠునకుఁ బెద్దకుమారుఁడు. మహావిద్వాంసుఁడు; మహాతపస్సంపన్నుఁడు. అదృశ్యంతి యాతనిభార్య. మహా పతివ్రత. ఆపన్నసత్త్వయై యున్నతనభార్యను దనచెంతఁ గూర్చుండఁబెట్టుకొని శక్తిమహర్షి యామెతో, వేదవేదాంగములఁగూర్చియు, నుపవేదములను గూర్చియు, రాజసూయాశ్వమేధాదిసవనతంత్రంబులను గూర్చియుఁ, బ్రసంగించుచు, వైదికవిజ్ఞానమామెయందు వికసింపఁ జేయుచుండెను. గర్భవతులైన స్త్రీల కిట్టిమహావిషయము లుపదేశించినచో గర్భమునందున్న బిడ్డల కావిద్యలు బాల్యముననే లభ్యములగునని యాతనికి విశ్వాసముగలదు.

భార్యాభర్తలిరువురును మహావిద్యలను గూర్చి యిట్లు ప్రసంగించుకొనుచుండఁగా, దూరమునుండి రథమొకటి తమవైపు వచ్చుచున్నట్లు వారికిఁ గన్పట్టెను. వాయువేగమనోవేగములతో వచ్చుచున్నయారథము స్వల్పకాలములోనే తమ

యొద్దకు వచ్చెను. రథముతో లుచున్న సుదాసమహారాజు త్రోవలోనున్న మునిదంపతులను జూచి "తొలఁగు త్రోవయిమ్ము" అని యదలించెను. ఆతఁడు మహారాజన్న సంగతి శక్తిమహాముని యెఱిఁగినవాఁడగుటచే, తాను గూర్చున్న స్థలమునుండి లేవక, "మహారాజా, యిది ధర్మముకాదు. ఇదివశిష్ఠులయాశ్రమము. వశిష్ఠులు నీకు బురోహితులు; గురువులుఁను. విశేషించి యీయాశ్రమము నీకు గురుస్థానము. నీవిక్కడనే విద్యాభ్యాస మొనర్చితివి. సూర్యవంశసంభూతుఁడవును, వశిష్ఠుల శిష్యుఁడవునైన నీ వెఱుఁగనిధర్మములు లేవు. నీవే యధర్మమొనర్చిన, నిఁకధర్మము పాలించువారెవ్వరు? గురుస్థానము సమీపించునప్పుడు దూరముగానే రథముదిగి, పాదచారివై యాశ్రమమునకుఁ బోవలయును గదా. నీవురథముతోనే యాశ్రమమునకుఁ బోయెదవా? ఇదియుచితమా?" అని శక్తి యుపన్యసింపసాగెను.

"నీయుపన్యాసములు కట్టిపెట్టి నాకుఁద్రోవయిచ్చెదవా, లేదా"

"లేదు. నేననీకుఁద్రోవనీయను. రథముపై నాశ్రమము లోనికిఁ బోవుటకు వలనుపడదు."

"నేఁజెప్పలేదా? నీకిప్పుడు తెలియుచున్నదా? వాశిష్ఠులే యిట్లున్నచో, వశిష్ఠుఁడింక నెట్లుండునో యాలోచించు

పొమ్ము." అని రథములోనుండి విశ్వామిత్రుఁ డనుచుండెను. అగ్గిపై గుగ్గిలముజల్లినట్లు సుదాసుఁడు మండిపడి, "ఏమి యీ కండకావరము! ఒక్క వేగులబాపనయ్యకు బడాయి మెండు గానున్నది; చూడు నీకొవ్వణగించెదను!" అని కేకలువైచి, తనచేతినున్నకశకోలతో నామునికుమారుని నొక్కదెబ్బ కొట్టెను. మునికుమారుఁడు కోపము తెచ్చుకొని, "మనుష్యాధమా, నీవు మనుష్యుఁడవై యుండియు, రాక్షసకృత్యముచేసితివి గావున, మనుష్యమాంసమును భక్షించురాక్షసుఁడవై పోవుదువుగాక" అనిసుదాసుని శపించెను.

"నేనున్నాను, నీకేమియును భయములేదు. ఈశాపము నిన్నేమియును జేయదు." అని విశ్వామిత్రుఁడు లోనుండి యనుచుండెను.

"ఛీ, దుర్మార్గుఁడా, నాయన్నమును దినుచుండియును నన్నే తిట్టెదవా? నేఁటినుండి మీకును మాకును సంబంధము సరి. మీరుమాకుఁ బురోహితులుగా నుండనక్కఱలేదు." అని యఱచుచు సుదాసుఁడు రథమును మరలించుచుండెను.

"కులగురుత్యాగమువలన నీరాక్షసత్వము స్థిరపడుచున్నది. పొమ్ము." అని శక్తి జవాబుచెప్పి, రాజువైపు చూచుటమాని, తనభార్యతో మరలఁ బ్రసంగింప నారంభించెను.

సుదాసుఁడు రథమును మరలించి, తిన్నఁగాఁ దనయూరికి విశ్వామిత్రునితోఁ గలిసి పోయెను. నాఁటినుండియును, సుదాసునకు విశ్వామిత్రుఁడు పురోహితుఁడయ్యెను. విశ్వామిత్రుఁ డెట్లు చెప్పిన నట్లే సుదాసుఁడు నడచుకొనుచుండెను.

ప్రసంగము ముగిసినపైని శక్తి తండ్రిగారియొద్దకుఁ బోయి జరిగినదంతయును విన్నవించి, తాను రాజునకుఁ దగిన ప్రాయశ్చిత్తము చేసితినని చెప్పెను. వశిష్ఠుఁడు చాలవిచారించెను. "నాయనా, ఎంతపని చేసితివి? రాజులు రజోగుణప్రధానులు గావున, వారొకప్పుడు తొందర పడుచుందురు గాని, సత్త్వగుణప్రధానులముగా నుండవలసిన మనముకూడ నట్లేతొందరపడి యొకరినొకరు నశింపఁ జేసికొనుటవలన లోకమునకు హాని కలుగదా? బ్రాహ్మణుఁడు తానెల్లప్పుడును సత్త్వగుణప్రధానుఁడై యే యుండి, రజోగుణప్రధానుఁడైన రాజును గ్రమముగా సత్త్వగుణప్రధానునిగాఁ జేసినచో, నాతని ధర్మపరిపాలనమువలన లోకమునకు మంగళము చేకూరును గాని, బ్రాహ్మణుఁడే రజోగుణప్రధానుఁ డైపోయినచో నిఁక రాజులయందు సత్త్వగుణమును బుట్టించువారెవ్వరు? మహారాజును రాక్షసుఁడవు గమ్మని శపించితివి గదా; ఆశాపము నీవిచ్చుటకుఁ గారణమేమి? నీకుఁ గోపము కలుగుటచేత. కోపమనఁగానేమి? అది యసురగుణము. కావున మహారాజు రాక్షసుఁడగుటకుముందు నీవే రాక్షసుఁడవైతివి. కావున

నీయందలియసురగుణము నశించుటకై తీవ్రమైనతపస్సును జేయుము. పొమ్ము.'' అని వశిష్ఠుఁడు కుమారుని మందలించి, మహారాజునకు శాపము కలిగినందుకు విచారించుచుండెను.

మునికుమారుఁడిచ్చినశాపముచే సుదాసుఁడు రాక్షసత్వము పొందుచుండినను, విశ్వామిత్రునితపశ్శక్తిచే సడిక్రగ్గుచుండెను. కావున, ఒక్కొక్కప్పుడు రాక్షసకృత్యములు లొనర్చుచుండుటయు, మరల పశ్చాత్తాపము నొందుటయును, జరుగుచుండెను. కాని, వాశిష్ఠునిశాపము బలమైనదగుటచే, విశ్వామిత్రునితపస్సును నిర్వీర్యముచేసి, సుదాసునియందు రాక్షసత్వము స్థిరపఱచుటకుఁ దగినయొకానొక వింతవిషయ మొక నాఁడు కలిగించెను.

ఒకనాఁటి సాయంకాలమున సుదాసుఁడు నెమ్మదిగా నున్నప్పుడు బ్రాహ్మణుఁడొకఁ డాతనియొద్దకుఁ బోయి, తనకు మాంసయుక్తమైనభోజనము నొసంగవలెనని ప్రార్థించెను. సుదాసుఁ డందుకంగీకరించెను. కాని, యింతలో మరలరాక్షసత్వావిష్టుఁడై యాసంగతి మఱచిపోయెను. అర్ధరాత్రమున మరలఁ దనకు రాక్షసత్వము విడిచినతోనే, యాసంగతి జ్ఞప్తికి వచ్చి, వంటవాని బిలిపించి, "బ్రాహ్మణునకొకనికి మాంసయుక్తభోజన మొసంగుట కంగీకరించి యది మఱచితిని. వెంటనే వండి బ్రాహ్మణునకు వడ్డింపుము'' అని యాజ్ఞాపించెను.

"ఇంతరాత్రియప్పుడు మాంసము నేనెక్కడినుండి తేగలను." అని వంటవాఁడడిగెను.

"మృగమాంసములేకున్న మనుష్యమాంసమైన వండిపెట్టు" మని రాజానతిచ్చెను.

వంటవాఁడు వధ్యస్థానమునకుఁ బోయి, మనుష్యమాంసము తెచ్చి వండి, బ్రాహ్మణునకు వడ్డించెను. మనుష్యమాంసమని యాతఁడు పోల్చుకొని, "ఛీ, మీరాజు వట్టిదుర్మార్గుఁడు. మహర్షినైననాకు మనుష్యమాంసము వండిపెట్టించెను. కావున మీరాజు మనుష్యాదుఁడైన రాక్షసుఁడై పోవుఁగాక" యని శపించెను.

వాశిష్ఠునిశాపమున కీశాపము తోడయ్యెను. విశ్వామిత్రుఁడెంత ప్రయత్నించిన నీశాపమును మఱిత్రిప్పలేకపోయెను. సుదాసుఁడు సంపూర్ణముగ రాక్షసుఁడయ్యెను. మనుష్యుల నాతఁడు తినుట కారంభించెను.

"ఇదియును గొంతమంచిదే" యని విశ్వామిత్రుఁ డనుకొనెను. "బుద్ధిమంతుఁ డాపదలుగాఁ గన్పడుచున్నవాని నన్నిఁటిని సంపదలుగా మార్చుకొనఁగలఁడు. ఈ సమయము వ్యర్థముచేయఁగూడదు." అని విశ్వామిత్రుఁడు నిశ్చయించుకొనెను.

"సుదాసా, నీకు రాక్షసత్వము కలుగుట శక్తి శాపము వలననని మాత్రము మఱవవద్దు." అని యాతనిఁ బురికొల్పెను.

"అవును. నిజమే, నేనాతని నమిలి మ్రింగివేసెదను."

"ఆతనిఁదిని వైచినచో, నాతనితమ్ములు నిన్ను బ్రతుకనిత్తురా!"

"ఓహో, వారిలక్ష్యము నాకేమి? వశిష్ఠునికుమారుల నందఱను భక్షించి నాకోపము తీర్చుకొందును."

"ఏదో, నీపని చూచుకొమ్ము; నీకు శాపవిమోచన మగుటకై నేనుబోయి తపస్సుచేసెదను." అని చెప్పి విశ్వామిత్రుఁడు వెడలిపోయెను.

# ఆఱవ ప్రకరణము

## కుటుంబనాశనము

అహింసయే ప్రధానగుణముగా నుండవలసినతనకుటుంబమున నసురగుణమైనక్రోధ మంకురించినందునఁ, దన కేమి కీడురానున్నదోయని వశిష్ఠుఁడు విచారించుచు, నిష్కారణముగా రాజును దనకుమారుఁడు శపించినందుకుఁ బరితపించుచుండెను. తనయందు రాక్షసత్వము స్థిరపడుటచే సుదాసుఁడు మనుష్యమాంసమేగాని, యితరమాంస మొల్లనివాఁడై, విశ్వామిత్రుఁడు తిన్నఁబురికొల్పిన వెంటనే వశిష్ఠాశ్రమమునకుఁ బరుగెత్తెను.

అర్ధరాత్రమైనది. వశిష్ఠాశ్రమమున నందఱును గాఢముగా నిద్రించుచుండిరి. సుదాసుఁడందుఁ బ్రవేశించెను. తనకుఁ దృప్తిదీఱ నాహారము లభించినదని సంతోషించెను. వశిష్ఠునికొడుకులను, గోడళ్లను, అందఱ నొక్కొక్కఁ జఱివు చఱచి చంపి, శవములను బ్రక్కనున్నయొక్క గుహాలోనికి మోసికొనిపోయి, తెల్లవారులోపున నందఱను భక్షించెను. వశిష్ఠుఁడు నియమితకాలమునలేచి, స్నానసంధ్యాద్యనుష్ఠానములు నిర్వర్తించుకొని, యరుంధతిరాకకై వేచికొనియుండెను. కాని యెప్పటియట్లామెరాకుండుటచే, నాశ్రమము నలుగెలం

తులఁ బరికింపసాగెను. భార్యలేదు. కొడుకులులేరు. కోడళ్లు లేరు. అర్ధరాత్రమున రాక్షసుఁడెవ్వఁడో యాశ్రమమునఁ బ్రవేశించి మనుష్యులను జంపి ప్రక్కనున్న గుహాలోనికిఁ దీసికొనిపోయెనని యెవ్వరో చెప్పిరి. వశిష్ఠుఁడా గుహాభ్యంతరమునకుఁ బోయి పరీక్షించెను. అందు మనుష్యులయెముకలును, పుఱ్ఱెలును, గన్పట్టెను. అట్టివి మున్నెన్నఁడు నందు లేకుండుటచే, నామాట నిజమే యని యాతఁడునమ్మెను.

మఱల నాశ్రమమునకుఁ బోయెను. గుండె జల్లుమనెను. కాళ్లును జేతులును వణఁకుచుండెను. దైవగుణములైన శమదమాదులను సాధించినవాఁడేయయ్యును, మహాపదలో మునిఁగియున్నవాఁడగుటచే నప్పుడాతనిదైవగుణములు తిరోధానమును బొందినవై, మనుష్యగుణములుద్రేకించెను. కావున, శోకరస మొక్కసారిగ నాతని నాక్రమించెను. లోకమంతయు నంధకారమయమైన నట్లాతనికిఁ గన్పట్టెను.

తపస్సు చేసికొనుటకై తనయాశ్రమమునకు మరలిపోవుచుండిన విశ్వామిత్రుఁడు, చూచిపోయెదనని వశిష్ఠాశ్రమమువైపు వచ్చుచుండెను. పిచ్చియెత్తినవశిష్ఠు నాతఁడుచూచెను. "అయినది. ప్రాయశ్చిత్తమైనది. అయ్యగారితపోబలమిప్పుడు తెలిసినది." అని మరల "నాకిప్పుడు బ్రహ్మానందముగానున్నది." అని యనుకొనుచుఁ దనదారిని బోయెను.



# ఏఁడవ ప్రకరణము

## ఆత్మదానము.

ఉదంకుఁడొక్కఁడే యరణ్యమధ్యమునఁ బోవుచుండెను. త్రోవలో మేకలకాచుకొనుచుండుగొల్లలు కొందఱు కనఁబడి, "ఈదారి యిప్పుడు బందైపడి, బాపనయ్యా, యీతోవను వెళ్లఁగూడదు. తిరిగిపో" అని యాతని ప్రయాణము నివారింపఁ జూచిరి. "ఏమిరా, ఏలయట్లనుచున్నారు?" అని యాతఁడు ప్రశ్నింపగా, "బాబూ, యెవఁడో సూర్యవంశపు రాజఁట, బాపనయ్యనెవనినో తిట్టినాఁడఁట, అందుచేత రాకాసి యయిపోయినాఁడఁట; ఏమడిగెదవు బాబూ, ఈతోవనెవరు వెళ్లినను మింగివేయుచున్నాఁడఁట. మేముకూడ జడిసి జడిసి తిరుగుచున్నాము." అని వారు బదులుచెప్పిరి.

తనకుఁ గుండలప్రదాత కావలసియున్నసుదాసమహారాజు వాశిష్ఠశాపమున రాక్షసుండయ్యెనని తానువిన్నసంగతి నిజమేయనుకొని, యుదంకుఁడు సుదాసునియొద్దకు బోవుట మాని, తిన్నఁగా మదయంతియొద్దకే పోయి భార్గవుండైన యుదంకుండామెను దర్శింప వచ్చెనని కబురంపెను.

మహాపతివ్రతయైనమదయంతి తనభర్తకు రాక్షసత్వము వచ్చినను, ఆతని విడువలేదు. తనభర్త సంచరించుచున్న యరణ్యములోనే, యొకపర్ణశాలనిర్మించుకొని, ప్రాణేశ్వరుని రాక్షసత్వము నిర్మూలింపఁ జేయవలసినదని పరమేశ్వరుని, ప్రార్థించుచు, మహాతపస్సు చేయుచుండెను. కానిదనో తెలిసి కొనలేక, తనభర్తయొక్కొక్కప్పుడు తన్నే మ్రింగివేయుటకుఁ బ్రయత్నింపఁగాఁ, బరిశుద్ధసాత్త్వికభావములతోఁ, బరిశుద్ధసాత్త్విక వాక్యములతోఁ, బరిశుద్ధసాత్త్వికచేష్టలతో నాతని శాంతునిఁ జేసి, మంత్రముచే సర్పమును స్వాధీనముగాఁ జేసికొన్నట్లు తనపరిపూర్ణసత్త్వగుణముచే నప్పటికాతని శాంతింపఁజేసి పంపు చుండును. క్షణ మొకయుగముగా నీరీతిని దినములుగడపుచున్న యామదయంతి యొద్దకు నుదంకుఁడుపోయి, యథాసత్కా రములంది, గురుపత్నికై కుండలములు కావలసియున్న సంగతి యామెకు నివేదించి, యాకుండలములఁ దనకిచ్చి, గురువుల ఋణమునుండి తన్ను విముక్తునిఁజేయవలసినదని యామెను ప్రార్థించెను.

"నాభర్తగారియనుజ్ఞలేకుండ నే నేపనియుం జేయ జాలను." అని యామెస్పష్టముగాఁ జెప్పి, భర్తగారియొద్దకు బొమ్మని యాజ్ఞాపించెను. ఉదంకుఁడు మరల బయలుదేరి, సుదాసుఁడున్న యరణ్యప్రాంతమునకు వచ్చెను.

మిడిగ్రుడ్లు, కోరమీసములు, కొక్కిరిపండ్లు, రక్తసిక్త దేహము గలిగి, బీభత్సరసము మూర్తీభవించిన రాక్షసాకారముతోనున్న సుదాసుఁడు భార్గవుని, జూచినతోడనే, "చిక్కెనురా మనుష్యుఁడు, చిక్కెనురా" అని తటాలున నాతనిఁబట్టుకొనఁబోయెను.

ఉదంకుఁడు తప్పించుకొని "ఆఁగుము. ఆఁగుము. నీవు రాక్షసుఁడవు కావు. మహారాజవు. సుదాసుఁడవు. జ్ఞప్తికిఁ దెచ్చుకొమ్ము." అని ధైర్యముతోఁబల్కెను.

ఉదంకుని యదృష్టవశమునను, గౌతమునితపఃప్రభావమునను, రాక్షసుఁడు కొంచెము తాళి, "నేనుసుదాసుఁడనా?" అని,—మరల "కాను, కాను. నేను రాక్షసుఁడనే. మనుష్యమాంసమునకై వాఁచిపోయియున్నాను. నీవు దొరకితివి. నాకానందముగానున్నది. తృప్తితీఱఁదిందును." అని మీఁదఁబడి పట్టుకొనఁబోయెను.

"కొంచెమాగుము. నేఁజెప్పవలసినమాట యొక్కటి గలదు. విని తరువాత నీపనిచేసికొనుము."

"వేగముగాఁ జెప్పివేయుము."

"మాగురుపత్ని నీ భార్యకుండలము లడిగి తెమ్మన్నది."

"నాభార్య! ఎవరునా భార్య?"

"మదయంది."

"మదయంతి—మదయంతి—అవును. మదయంతి నాభార్యయే: కాదని యెవరనఁగలరు?"

"ఆమెయొద్దనున్నకుండలములడిగి మాగురుపత్ని తెమ్మన్నది."

"కాఁబట్టి యేమిచేయవలెను?"

"నీభార్యయొద్దనున్న కుండలములు నాకిప్పింపుము. నేనవి తీసికొనిపోయి గురుపత్నికిచ్చి మరల నీయొద్దకు వచ్చెదను."

"చేయిజారిపోయినతరువాత మరల నీవువారకెదవా?"

"నేను భార్గవుఁడను. అసత్యమాడను. గురువులసెలవు గైకొని మరల నీయొద్దకు వచ్చెదను."

"నీవు భార్గవుఁడవా, వాశిష్ఠుఁడవుకావుగద! వాశిష్ఠులను నమ్మలేములే."

"నేనుభార్గవుఁడనే. నామాట నీవు నమ్మవచ్చును. మొదట నాకుఁ గుండలములిప్పింపుము."

"ఒకరియొద్దనున్న సొత్తును నేనెట్లిప్పింపఁగలనయ్యా; నీవేపోయి మదయంతి నడిగివుచ్చుకొమ్ము."

"మొదట మదయంతియొద్దకే పోయియుంటిని. నీసెలవుకానిదియు నామె యాకుండలములు నాకిచ్చుట కంగీకరింపలేదు. కావున నీయొద్దకు వచ్చితిని."

"ఇప్పుడు మరలపోయి యడుగుము; నేఁజెప్పితినని చెప్పుము."

"సంకేతమేమైన జెప్పుమన్నచో—"

"ఈ మాటసంకేతముగాఁజెప్పుము. 'ఇది క్షేమమార్గమని నిశ్చయించుటకు వీలులేదు. కాని, ఇది తప్ప మరియొక మార్గములేదు.' ఈమాటచెప్పినచో నామె కుండలములు తప్పకయిచ్చును. పొమ్ము."

ఉదంకుఁడు మదయంతిపాలికి మరలఁబోయి, సుదాసుని యనుజ్ఞ నామెకుఁ జెప్పి, సంకేతవాక్యమునుగూడ నివేదించెను. వెంటనే యామె కుండలములు పైకితీసి "ఎంతవిలువగలవస్తువైనను, నాభర్తయెవ్వరికినైన నిమ్మన్నచోఁ దప్పక యిచ్చివేసెదను. ఇదిగో, తీసికొమ్ము." అని చెప్పి యిచ్చివేసెను.

"ఈకుండలములు చాలమహిమగలవి. వీనికొఱకై గొప్పగొప్పవారనేకులు నన్నుఁ బ్రార్థించిరి. నాభర్తయనుజ్ఞ లేకుంటచే నేనవి వారికీయలేదు. కావున వానిని జాగ్రత్తతోఁ దీసికొనిపొమ్ము." అని మదయంతి నొక్కిచెప్పెను.

ఉదంకుఁడామెయిచ్చినకుండలములఁ దీసికొని, కన్నుల నద్దుకొని, తనమూటలో భద్రముగాఁ గట్టుకొని, యామె నాశీర్వదించి సుదాసునికడకు మరలఁబోయెను.

"రాజేంద్రా, నీకటాక్షమువలన నాగురుఋణము తీఱిపోవును. నేను సెలవుదీసికొనెదను. కాని, నాకొక్క సందేహమున్నది."

"ఏమాసందేహము ?"

"ఆసంకేతవాక్యమున కర్థమేమో నాకు సెలవిమ్ము."

"భృగువర్యా, నీవు సద్బ్రాహ్మణుఁడవలెఁ గన్పట్టుచున్నావు. ఈవఱకు నాయందు క్రోధము, కామము, క్షణక్షణము నుద్రేకించుచుండెను. పూర్వస్మృతి తగ్గిపోవుచుండెను. నిన్నుఁ జూచుచున్నప్పుడును, నీతో మాటాడుచున్నంతసేపును, శాంతచిత్తత కలుగుచున్నది. పూర్వస్మృతి కలుగుచున్నది. కావున, నీతో మాటాడఁగలుగుచున్నాను. బ్రాహ్మణులను బూజించుటవలన మేలే కలుగునని చెప్పలేము. ఏస్వల్పలోపముకన్పడినను వారు శపింతురు. కాని బ్రాహ్మణశాపమువలనఁ గలిగిననారాక్షసత్వము, బ్రాహ్మణులవలననే తప్పిపోవలెను. అందులకు, బ్రాహ్మణపూజనము తప్ప వేఱొక్క మార్గములేదు. అని యాసంకేతవాక్యముల కర్థము. నీవు పొమ్ము. నీమాటప్రకారము తిరిగిరమ్ము."

"తప్పక వచ్చెదను. నన్ను నీవు యథేష్టముగా భక్షింపవచ్చును. సెలవిమ్ము." అని చెప్పి, మాటభద్రముగాఁబట్టుకొని వెడలిపోయెను.

---

# ఎనిమిదవ ప్రకరణము



## ఆత్మహత్య.



సర్వకుటుంబ నాశనమువలనఁ దనయందలి దైవగుణ సంపత్తి తిరోధానమంది, మనుష్యగుణము లుద్రేకించినందున, శోకరసమున మునిఁగిపోయి, పిచ్చియెత్తినట్లయి, యాశ్రమము విడిచి వశిష్ఠుఁడు దేశభ్రమణ మొనర్చుచుండెను. పుణ్యశైలములు, పుణ్యనదులు, పుణ్యక్షేత్రములు, పుణ్యారణ్యములు, ఎన్ని దర్శించిన, ఎన్ని సేవించిన, నాత్మశాంతియాతనికిఁ గలుగలేదు. తనహృదయము శోకరసముతో నిండియుండెను. ప్రపంచము శోకరసముతో నిండియుండెను. సృష్టియంతయును శోకరసముతో నిండియుండెను. హిమవత్పర్వత శృంగములనుండి శోకరసము ప్రవాహరూపమై గంగాయమునాది మహానదీస్వరూపమై పొంగిపొరలిపాఱునట్లుండెను. మహాసముద్రము శోకరసపూరితమై, ఘూర్ణిల్లుచు, శోకరస తరంగములతో భూమిని గబళింపఁదలఁచుచున్నట్లుండెను. సూర్యుఁడు శోకరసఫలితమైన తాపముచే లోకమును మల మల మాడ్చునట్లుండెను. చంద్రుఁడు శోకరస బిందువులను మంచురూపమున రాత్రివర్షించుచుండినట్లుండెను. వాయువు తనయందలి శోక

రసస్పర్శమును లోకమంతటను వ్యాపింపఁజేయుచుండి నట్లుండెను. ఆకాశము శబ్దస్వరూపమైన శోకరసమేమై యుండెను. వేయేల! పంచభూతములును శోకరసనిర్మితములై, శోకరసస్వరూపములే యైయుండెను.

శ్లో॥ ఏకోరసఃకరుణఏవ, నిమిత్తభేదాత్
పశ్చాత్, పృథక్పృథగివాశ్రయతేవివర్తాన్;
ఆవర్త, బుద్బుద, తరంగ, మయాన్‌వికారాన్
అంభోయథా, సలిలమేవహితత్సమస్తమ్॥

అన్న మహాకవివాక్య మామహర్షి పట్ల యథార్థమై యుండెను. పిపీలికాది బ్రహ్మపర్యంతమును గార్యకారణ కర్తృత్వాది భేదరహితమైన కరుణరసమే యాతనికిఁ బ్రత్యక్షమై యుండుటచేఁ, దాను కరుణరసాద్వైతుఁడయ్యెను.

ఇంద్రియ నిగ్రహముచేఁ గలిగిన తపోబలము వలన బ్రహ్మాస్త్రము ననాయాసముగ భరింపఁగలిగిన యామహాత్ముఁడు మోహపరిగ్రహముచేఁ గలిగిన మనోదౌర్బల్యము వలన విశ్వామిత్రుఁడు ప్రయోగించిన యీశోకాస్త్రమును భరింపలేక, దానిభారమున నాతఁడు క్రుంగిపోయెను. బహుకాలమాతఁడు దేశసంచారము చేసిచేసి, యెందును మనశ్శాంతి గానక, జీవితముపై నాశవిడిచి, యాత్మహత్యచేసికొన నిశ్చయించెను. మోహమెంతపనిచేసెను! సముద్రతీరమునకుఁబోయి యక్కడ

నిలిచి సముద్రమును జూచుచుండెను. తనవలెనే సముద్రమును ఘూర్ణిల్లుచుండెను. తరంగహస్తములతోఁ దన్నుఁ బిలుచుచుండెను. రమ్ము, రమ్ము, నాకొక్కఁడే కుమారుఁడున్నాఁడు. నాకు వాఁడుండియును లేమిక్రిందలెక్కయే. కావున మనమిద్దఱము సమానులమే. రమ్ము. నాగర్భమున నిన్నుఁబెట్టుకొందును." అని సముద్రమనుచున్నట్లుండెను.

వశిష్ఠుఁడు సముద్రములోనికి దిగుచుండెను. చచ్చువానికి సముద్రము మోకాలిబంటియనునట్లు తానెంతలోతునకుఁబోవుచున్నను, మోకాలిబంటిగానేయున్నట్లు కన్పట్టుచుండెను. ముందుముందు జరిగిపోవుచున్నట్లుండెను. "అంత ప్రీతితోఁ తనయొద్దకు రమ్మని నన్నుఁబిల్చిన సముద్రుఁడు వెనుకకుఁ బోవుచున్నాఁడేమి" యని యాతఁడనుకొని, రహస్యసంభాషణకై యేకాంతము వలయునుగావున, దూరదూరముగా నన్నుఁ దీసికొనిపోవుచున్నాఁడేమో యనుకొని, ధైర్యముతో ముందుకుఁబోవుచుండెను. పెద్దకెరటమొకటి బయలుదేరినది. రెండుచేతులనుజాచి సముద్రుఁడు తన్ను గాఁగిలించుకొన వచ్చుచున్నాఁడని యాతఁడనుకొనెను. సంతోషించెను. సముద్రము ఘోషించుచున్నది. తరంగము సమీపించుచున్నది. వశిష్ఠుని చిత్తము సముద్రముతోఁ దరంగముతోఁ దన్మయమగుచున్నది.

వెనుకనుండి వేదనాదము వినవచ్చెను. వశిష్ఠునకు గుండెలుజల్లుమనెను. సముద్రముతో నైక్యానుసంధానమునొంది యేకాగ్రతకువచ్చుచున్న వశిష్ఠునిచిత్తము చెదరెను. నాదము వైపు మరలెను. కృతిపరిచయమైన నాదమువలెఁ దోఁచెను. మరల నాగమునువినెను. శక్తికంఠస్వరమువలె వినఁబడెను. వశిష్ఠుఁడు వెనుకకుఁదిరిగి చూచెను. "వద్దు. వద్దు. వద్దు. ఆత్మహత్యాకవసరములేదు. తిరిగిరమ్ము" అని స్పష్టముగా నారదుని మాటలు వినఁబడెను. ఒకస్త్రీయును, ఒకబాలుఁడును, నారదునితోఁ దీరమునఁ గనఁబడిరి. తేరిచూచెను. తనకోడలైన యదృశ్యంతి ; కుటుంబనాశనము పూర్తిగాఁ గాలేదు. జీవించుట కవకాశమున్నది. తిరిగియొడ్డునకు వచ్చెను. నారదునకు నమస్కారముచేసెను. కోడలినమస్కార మంగీకరించెను. బాలుఁడు తనపాదములు పట్టుకొనెను. ఈతఁడెవ్వఁడు ?

"నారదమునీంద్రా, ఏమి యీయద్భుతకటాక్షము ! ఈబాలుఁడెవ్వఁడు ?"

"వశిష్ఠా! నీవంటి బ్రహ్మర్షియే మోహమును జయింపలేకున్న, నింక జయింపఁ గల్గువాఁడెవ్వఁడు? నీకిట్టి విపత్తు రానున్నదని నే నెఱుఁగుదును. బ్రహ్మాస్త్రముచే నిన్ను జయింపలేక, తపోబలముచే నిన్ను జయింపలేక మోహాస్త్రము నీపై బ్రయోగించి, విశ్వామిత్రుఁడు నిన్ను జయింపనున్నాఁడనివిని, నిన్నురక్షించుటకై, నీయాశ్రమము గనిపెట్టుకొని

నేను తిరుగుచుంటిని. సుదాసుఁడు నీకుటుంబనాశనముచేయుచున్న రాత్రి నేనక్కడనేయుండి, గర్భవతియైయుండిన యీ నీకోడలాతని చేతఁబడకుండ నీమెనుగాపాడి, నాయింటికిఁ దీసికొనిపోయితిని. నీభార్యను గూడ రక్షింపదలచితిని గాని, యామె నాకెందును గనఁబడలేదు. నిండు చూలాలగుటచే, నీమెను నాయింటనే యుంచి సంరక్షించితిని. ఈబాలుఁడు నీ పౌత్త్రుఁడు. శక్తికిఁగల తపోమహిమ యంతయును గలవాఁడు. నీకొఱకై నేను తిరిగితిరిగి, యిక్కడనిన్నుఁబట్టుకొంటిని.క్షణమాలస్యమైన, నీయాత్మహత్య ముగిసియుండును. భగవంతుఁడు సరియైన వేళకేనన్నుఁ దీసికొనివచ్చినాఁడు. ఈ నీ పౌత్త్రునిముఖముచూచి,జీవితాశగలిగించుకొమ్ము. నీయాశ్రమమునకు మరలి రమ్ము. విద్యాతపోబలములు కలిగించి, యీబాలునిఁ, దన్మూలమున నీకుటుంబమును, వృద్ధిచేసికొమ్ము. నీశిష్యులందఱును నీకై నిరీక్షించుచున్నారు. వారినివిడిచివైచి, నీవిట్లాత్మహత్య చేసికొనఁదగునా ?” అని నారదుఁడాతని మందలించెను.

“మోహావశమున మతిపోయి చేసినపని క్షమింపుము. నారదమునీంద్రా ! నీవంటి లోకోత్తరుఁడైన మహర్షి యెందున్నాఁడు ? ధ్రువునకున్నత స్థానమును, ప్రహ్లాదునకు నారాయణసందర్శనమును, నీవలననేకదా కలిగినవి. ఆపదలోనున్న వారిని రక్షించుటయే పరమకర్తవ్యముగాఁ గలిగిన నీవంటి మహాత్ములు మఱికొందఱున్నచో, లోకమునకు లోపమేమి

యుండును? నన్ను క్షమింపుము. నాకుటుంబమును నిలిపితివి. నాప్రాణములు నిలిపితివి. ఇఁక నేను మరల లోకోద్ధరణకై తపస్సుచేసెదను. ఈసుకృతమంతయు నీదే." అని వశిష్ఠుఁడు తనభక్తివిశ్వాసములు వెల్లడిచేసెను. వారందఱును వశిష్ఠాశ్రమమునకు బయలుదేరిరి.

# తొమ్మిదవ ప్రకరణము

దొంగతనము.

ఉదంకుఁడొక్కఁడే యరణ్యమధ్యమునుండి పోవు చుండెను. మిక్కిలి యుత్సాహవంతుఁడై యుండెను. త్రోవలో నున్న తరుగుల్మలతాదులన్నియును నవ నవకాంతులతో విరాజిల్లుచుండెను. కలసి యాడుకొనుటకుఁ బాడుకొనుటకుఁ దన్నుఁ బిలుచుచున్నట్లుండెను. ఈ నూతనోత్సాహమునకుఁ గారణమేమి? అనుకూలకార్యాచరణమా? అభినవ యౌవనావిర్భావమా? రెండవదే కావచ్చునని యాతఁడనుకొనెను.

శ్లో. అసంభృతమ్ మండన మంగయష్టేః
అనాసవాఖ్యమ్ కరణమ్ మదస్య

ఆహా, కవియెంత చక్కఁగాఁ జెప్పెను?

శ్లో. నాభ్యస్తా ప్రతివాదబృందదమనీ విద్యావినీతోచితా,
ఖడ్గాగ్రైః కరికుంభకూటదలనైః నాకంననీతంయశః
*　　*　　*　　*
తారుణ్యంగతమేవ నిష్ఫలమహో, శూన్యాలయేదీపవత్.

"తారుణ్యంగతమేవ— యని నేను విచారింపవలసిన సమయమున, గురుకటాక్షమున, నాశ్రీనుల విద్యాప్రభావమున, నాకుఁగలిగిన యీ యభినవయౌవనమే నాకీయుత్సాహము నిచ్చుచున్నది. కాని, దీనివలనఁ బ్రయోజనమేమి? గృహస్థాశ్రమ స్వీకరణమా? కాదు. నాకుసునకు శరీరార్పణము; అయ్యో, యౌవనము వ్యర్థమైనదని విచారించితిని గాని, జీవనమే వ్యర్థమయ్యెనే! ఛీ, నేనెంతమూర్ఖుఁడను! గురుపత్నిహితార్థమై శరీరత్యాగము చేసికొనుటవ్యర్థమా! వృత్రసంహారమునకై తనశరీరమునుదధీచి యింద్రున కర్పింపలేదా? అతిథిసంతర్పణకై శిబి తనశరీరమును దానముచేయులేదా? ఎప్పుడైన మట్టిపాలేకానై యున్న యీశరీరము మహాకార్యమునకై వినియోగించుటకన్న సార్థకత్వమేమున్నది? గురుపత్నీకార్యనిర్వహణమునకై శరీరార్పణ చేయఁదలంచుకొన్నందున నేను విచారింపవలసిన యవసరమేమియును లేదు. మిక్కిలి సంతోషముగా నుందును, ఆపైని గురుకటాక్ష మెట్లున్న నట్లగును." అని యుదంకుఁడు మనస్సులో వితర్కించుకొనుచుఁ బోవుచుండెను. ఒకయుడ్డుదారిని మహర్షి యొక్కఁడు వచ్చుచుండెను. కొంచెము దూరములో నుదంకునిఁ గలసికొనెను. ఉదంకుఁడు నమస్కరించెను. మహర్షి యాశీర్వదించెను.

4

“అబ్బాయీ, నీవు భార్గవుఁడవుగదా.”

“చిత్తము.”

“గౌతమ శిష్యుఁడవుగదా.”

“చిత్తము.”

“మదయంతి యొద్దనుండి వచ్చుచున్నావుగదా.”

“చిత్తము.”

“ఈమార్గమున దొంగలు గలరు. కుండలములు భద్రముగా నుంచితివి గదా!”

“చిత్తము తామెవ్వరు?”

“మేము కాశ్యపులము, ఈ త్రోవను దొంగలున్నారు. నీవొంటరిగాఁ బోవుచున్నావని కనిపెట్టి, నీచరిత్ర యంతయును దివ్యదృష్టిచే నెఱింగి, నీకుఁ దోడుగాఁ గొంత దూరము రావలెనని యుద్దేశించి యిట్లు వచ్చితిని. అపాయకరమైన యరణ్యభాగమును దాటించి, యావలనాపని చూచుకొందును. మీగురువులకును నాకును జాలస్నేహముకలదు.” అని చెప్పుచు, కాశ్యపుఁడు భార్గవునితోఁగలసి నడుచుచుఁ బోవుచుండెను. మధ్యాహ్నము కావచ్చినది. గ్రీష్మకాలమగుటచే నెత్తి మాడుచున్నది. చెమ్మట కాఱుచున్నది. స్నానము చేసి మాధ్యాహ్నిక క్రియలు నిర్వర్తించు

కొనవలసి యున్నది. కొంతదూరములో నొక్క జలాశయము కనఁబడినది. అది చూచినతోడనే,

శ్లో. ఉష్ణాలుః శిశిరే నిషీదతి తరోర్మూలాలవాలే శిఖీ
నిర్భిద్యోపరి కర్ణికారముకుళాన్యాలీయతే షట్పదః
తప్తం వారి విహాయ తీరనళినీం కారండవస్సేవతే,
క్రీడావేశ్మని చైష పంజరశుకః క్లాంతో జలం యాచతే.

అన్న మహాకవి వర్ణనము జ్ఞప్తికి వచ్చినది. జలాశయ సౌందర్యమునకును, రచనాచమత్కారమునకును, నొక్కసారియే యానందము పొంగిపొరలి గానరూపమునఁ బైటకు వచ్చి యుదంకునిఁ దన్మయునిఁ జేసెను.

కాశ్యపుఁడు విని యూరకుండలేదు. "భార్గవా. నిజమే. కాని, ఆ కవియే చెప్పిన మఱియొక వాక్యము మఱచితివా ?

శ్లో. సుభగసలిలావగాహాః
పాటలసంసర్గసురభి వనవాతాః
ప్రచ్ఛాయసులభనిద్రాః
దివసాః పరిణామరమణీయాః.

ఇది యిప్పుడు మనకుఁ గావలసినది. చల్లని యీ చెఱువు నీట స్నానముచేసికొని, మాధ్యాహ్నికక్రియలు నిర్వర్తించుకొని, యించుకసేపీ వృక్షచ్ఛాయను విశ్రమించి, యెండతగ్గిన తోడనే మరల బయలుదేరుదము.

"అదియుక్తముగానే యున్నది. రండు. జలాశయము నొద్దకుఁ బోదము."

"నీమూటలను భద్రముగా నెక్కడనైన నుంచుకొనుము. నే నీవైపునకుఁ బోయెదను."

కాశ్యపుఁ డొకప్రక్కకుఁ బోయెను. ఉదంకుఁడు మూటలను జాగ్రత్తగాఁ దీరముననే యున్న యొకచెట్టుకొమ్మకు గట్టిగా ముడివైచి, యాయెదుట రేవుననే దిగెను. స్నాన సంధ్యాదు లొనర్చుకొని, కొన్ని కందమూలములు నమలి నీరు ద్రావి యాచెట్టునీడనే కూర్చుండెను. తన యాహ్నికములు తీర్చుకొని కాశ్యపుఁడుకూడ వచ్చెను. చక్కని యొక మఱ్ఱిచెట్టునీడకు భార్గవునిఁ గాశ్యపుఁడు తీసికొనిపోయెను. తపోమహిమలనుగూర్చియు, శాస్త్రవిశేషములనుగూర్చియుఁ, గాశ్యపుఁడు ప్రసంగించుచు, ఉదంకున కుత్సాహము, నద్భుతము గలిగించుచుండెను. ఎండవేడిమిని నడచి నడచి వచ్చుటచేతను, చల్లని చెట్టునీడను విశ్రమించియుండుటచేతను కాశ్యపుఁడు చెప్పుచుండిన చిత్రవిచిత్రములైన కథలు విని, యూఁకొట్టుచుండుటచేతను భార్గవునకుఁ గునుకు వచ్చెను. మూట తలక్రిందఁ బెట్టుకొని యాతఁ డట్లె పండుకొనెను. బాగుగా నిద్దురపట్టినది. గుఱ్ఱుపెట్టసాగెను. కాశ్యపుఁడిది కనిపెట్టెను. భార్గవుని తలయట్టె దొర్లించెను. మూట తప్పించెను. చేతితోఁ

బట్టుకొనెను. చప్పుడుచేయక మెల్లఁగాలేచెను. చల్లచల్లఁగ జాఱిపోయెను.

కొంచెమునేపటికి భార్గవునకుఁ దెలివివచ్చెను. తల క్రిందనున్న మూటకై తడవెను. మూటలేదు. లేచి కూర్చుండెను. ఈప్రక్కఁ జూచెను. ఆప్రక్కఁ జూచెను. మూటలేదు. లేచినిలుచుండెను. చెట్టుపైకిఁ జూచెను. మూట లేదు. కాశ్యపా—కాశ్యపా యని పిలిచెను. పలుకలేదు. ఇటునటునడచి పిలిచెను. పలుకలేదు. జలాశయమునొద్దకుఁ బోయెను. "కాశ్యపా" యని పిలిచెను. పలుకలేదు. తీరమున నున్న చెట్టుకొమ్మలనుజూచెను. మూట కనుపడలేదు. ఈచెట్టు కాదాచెట్టేమో యనుకొని, యక్కడికిఁబోయి చూచెను. అక్కడనులేదు. కాశ్యపుఁడు పలుకఁడు. మూట కనఁబడదు. తనకన్నులను దానే నమ్మకుండెను.

నిద్దురపట్టినందుకుఁ దన్నుఁదానే తిట్టుకొనుచుండెను. గుండెలు కొట్టుకొనుచున్నవి. కాళ్లు వణఁకుచున్నవి. చేతులు వణఁకుచున్నవి. అరణ్యరోదనము. వినువారులేరు. చెప్పు వారులేరు. పిచ్చియెత్తినట్లు పరుగెత్తసాగెను. కొన్నిమైళ్ల దూరము పరుగెత్తెను. ఎక్కడికిఁ బోవుటయో, ఏమిచేయు టయో తనకేమియుఁ దెలియకుండెను. ఏల పరుగెత్తుచుండెనో యాసంగతికూడఁ దెలియకుండెను. మూఁడు ఝాముల వేళ

యైనది. దప్పియగుచుండెను. సరియైనమార్గమునఁగాక, తప్పు త్రోవను బరుగెత్తియుండుటచే, జలాశయమేదియుఁ గన్పడకుండెను. నోటఁ దడిలేదు. అఱచుటకైన శక్తిలేదు. ఏమహాత్ముఁడైన పుడిసెడు నీళ్లిచ్చినచోఁ బ్రాణములు నిలుచును. ఎవ్వఁడును గన్పడలేదు. దూరమునుండి యెవ్వఁడో వచ్చుచుండెను. కాశ్యపుఁడేమోయని బిగఁబట్టి చూచెను. కాశ్యపుఁడుకాఁడు. కాకపోయినఁబోనిమ్ము. చేత కమండలువున్నది. నీరుండవచ్చును. క్రొత్తవాఁడు సమీపించెను. నీరు త్రాగుమని చెప్పెను. బ్రాహ్మణునివలెఁ గన్పడలేదు. నీ వెవ్వఁడవని ఉదంకుఁడు మెల్లఁగా నడిగెను. చండాలుఁడనని క్రొత్తవాఁడు చెప్పెను.

"ఛీ ప్రాణముపోయినఁ బోనిమ్ము. చండాలుని నీరు త్రాగను."

"తప్పులేదు—త్రాగవయ్యా."

"వద్దు. వద్దు. దూరముగాఁబొమ్ము."

క్రొత్తవాఁడు నవ్వెను. "ఆపద్ధర్మముగా నైనఁ ద్రాగుము"

"ఏమియును వద్దు. పొమ్ము"

క్రొత్తవాఁడింకను నవ్వుచుండెను.

"బ్రాహ్మణులతోఁ బరియాచకమా!" యని భార్గవుఁడు గట్టిగాఁ గష్టపడి యనెను.

"భార్గవా, నే నింద్రుఁడను. నిన్నుఁ బరీక్షించుటకై యిట్లు చేసితిని. నీకు సమదర్శనత యింకను గలుగలేదు. 'బ్రాహ్మణే గవి హస్తిని, శునిచైవ శ్వపాకేచ, పండితాస్సమదర్శినః.' ఆపద్ధర్మముగానైన సమబుద్ధి వలదా. ఈ జలము త్రావుము. ప్రాణములు నిలుపుకొనుము."

"అవును. నిజమే. బ్రాహ్మణునకు సమబుద్ధి యవసరమే. నాతప్పు క్షమింపుము." అని భార్గవుఁడు నీరు త్రాగెను— తెప్పిఱిల్లెను.

"మీ దర్శనమువలన ధన్యుఁడనైతిని. కాశ్యపుఁడు మీకెక్కడనైనఁ గన్పడెనా!"

"మంచి కాశ్యపుఁడే దొరకెను నీకు" అని యింద్రుఁడు నవ్వి, "వాఁడు మహర్షి కాఁడు; తక్షకుఁడు; మదయంతి కుండలములకై యెంతకాలము నుండియో ప్రయత్నించుచుండెను. ఆమె యెవ్వరికి నియ్యలేదు. తక్షకునకు దర్శనమే యియ్యలేదు. భర్తగారి యనుజ్ఞ గావున నామె నీకిచ్చి వేసినది. నీకిచ్చినసంగతి తక్షకుఁడు కనిపెట్టి నిన్ను మాయచేసి నీయొద్ద నుండి దొంగిలించుకొనిపోయెను."

"అయ్యెన, మహాత్మా, నాకుండలములు నాకు మరల దొరకు నుపాయము చెప్పరా !"

"నాగలోకమునకుఁబోయి, నాగనాయకుల నాశ్రయించినఁగాని యవినీకు మరలదొరకవు."

"నాకుఁ ద్రోవ తెలియదు."

"ఒక బిలద్వారమునుండి నాగలోకమునకుఁ బోవలెను. నాతోరమ్ము. నీకాబిలద్వారము చూపెదను." అనిచెప్పి యింద్రుఁడుదంకుని బిలద్వారమునకుఁ దీసికొనిపోయెను. "ఈ ద్వారమున నీవు నాగలోకమునకుఁబొమ్ము. నాగనాయకుల నాశ్రయింపుము." అని చెప్పి, యింద్రుఁడు తనదారినిబోయెను. ఉదంకుఁడు నాగలోకమునకుఁ బోయెను.

# పదవ ప్రకరణము

## నాగలోకము

బిలద్వారమున నుదంకుఁడు నాగలోకమునఁ బ్రవేశించెను. ఆర్యులు బ్రహ్మావర్తమునుండి బ్రహ్మర్షిదేశము, నందుండి యార్యావర్తమంతటను, వ్యాపించుచున్నప్పుడు, నాగులను ననార్యులు పల్లపుప్రదేశముల నాక్రమించుకొనియుండిరి. ఆ పల్లపుప్రదేశములకే బిలములనియు, గర్తములనియుఁ బేరు. నాగనాయకుఁడైన వృత్రుని నాతని నూర్వురుసోదరులను, జంపి, యింద్రుఁడు నదీజలము లార్యులకు స్వాధీనము లగునట్లు చేసెను. అనాగరకులైన నాగులతో నాగరకులైన యార్యులకు సంబంధములు కలసి, నాగరకనాగజాతియొకటి యేర్పడినది. ఇట్టినాగరకనాగజాతి యుత్పత్తియగుటకుఁ గశ్యపుఁడు ప్రధానుఁడు. నాగస్త్రీయైనకద్రువ నాతఁడు పెండ్లియాడుటచేఁ గలిగినకాద్రవేయులు భావికాలమున నాగజాతిగాఁ బరిణమించిరి. నాగులుపల్లపుప్రదేశముల నాక్రమించుటచేత నవి చాలసారవంతము లగుటచేతను, నాగనాయకులు ధనవంతులును, బలవంతులునై యుండిరి. కొందఱు నాగనాయకు లార్యనాయకులతోఁ గలసి, మిత్రులై యుండిరి. కొందఱు కలసియుఁ

గలయనిస్థితిలో నుండిరి. ఆర్యనాయకులతో సంపూర్ణమైత్రి సంపాదించినవారు శేషవాసుకులు. అటునిటుగా నున్నవారు తక్షకైరావతులు.

ఉదంకుఁడు నాగలోకమునఁ బ్రవేశించి, తక్షకపురమును గూర్చి యక్కడివారిని బ్రశ్నించి, యడుగుచుఁ బోవుచుండెను. నాగలోకమున నాగనాయకు లొక్కొక్కరు ప్రత్యేక పురములను నిర్మించుకొని యుండుటచే, తక్షకపురమును గూర్చి తెలిసికొనవలసిన యవసరము కలిగెను. ఉదంకుఁడు తక్షకపురమునకుఁ బోయి, యాతనిదర్శనము చేసి, యాతని నిట్లుస్తుతించెను.

ఉ. గోత్రమహామహీధరనికుంజములన్, విపినంబులన్ గురు
క్షేత్రమునన్ బ్రకామగతి ఖేలననొప్పి సహాశ్వసేనుఁడై
ధాత్రిఁ బరిభ్రమించు బలదర్పపరాక్రమునకు జ్జూఁ డీక్షణ
శ్రోత్రవిభుండు, తక్షకుఁడు సూనుఁడు మాకుఁ బ్రసన్నుఁ
డయ్యెడున్.

ఈ స్తోత్రములకుఁ దక్షకుఁడు లొంగవలసినవాఁడు కాఁడు. వచ్చినకార్యము వేగమచెప్పి పొమ్మనియెను. ఆ బ్రాహ్మణుఁడు వచ్చినపని తనకుఁ దెలియును. అయినను, రైలు బండిలో టిక్కట్టులేకుండ నెక్కినవాఁ డెంతకృత్రిమధైర్యముతోఁ గూర్చుండునో అంత ధైర్యముతోఁ గూర్చుండి, "ఏమికావలెను. వేగము చెప్పుము." అని గట్టిగాననెను.

"నా కుండలములు నా కిచ్చివేయుము నేఁబోయెదను." అని, యుదంకుఁడు వైదికముగా నడిగెను.

"ఛీ, ఛీ, ఆవలకుఁబొమ్ము. కుండలములేమి! నీవేమి!"

"కాశ్యపుఁడన్న పేరను నీవు నాతోఁ గొంతదూరము వచ్చి, నాకు నిద్దురపట్టినప్పుడు నామూట యెత్తుకొనిపోలేదా! అసత్యమాడకుము. ఆ మఱ్ఱిచెట్టే సాక్ష్యము. ఆకాశమే సాక్ష్యము."

"మఱ్ఱిచెట్టు సాక్ష్యము—ఆకాశము సాక్ష్యము—ఏమి యీ వైదికము! ఛీ, ఛీ, ఆవలకుఁ బొమ్ము."

"పొమ్మన్నఁ బోయెదనా; నా కుండలము లిచ్చి వేయుము. నేఁబోయెదను. మఱ్ఱిచెట్టుసాక్ష్యము నీకుఁ బనికి రాదా? ఇంద్రుఁడు నాకుఁ జెప్పెను. నీవే నాకుండలములు తీసితివి. ఇంద్రుఁడు తాను స్వయముగఁ జూచినట్లు నాతోఁ జెప్పెను. తే, నాకుండలములు తే."

"ఇంద్రుఁడు చెప్పెనా, ఇంద్రుఁడు చెప్పెనా." అని తక్షకుఁడు పెదవులు తడువసాగెను. "అన్నా, గాడిదకొడుకు, ఇంద్రుఁడెంతపనిచేసెను? తనకుదొరకలేదుగదాయని మచ్చ

రము చేత, నాద్రొంగతనము పట్టియిచ్చెను. కానీ, చూతము—" అని యనుకొని,—"ఛీ. ఛీ.—ఇంద్రుఁడు పట్టిద్రొంగ; మోసగాఁడు. మచ్చరీఁడు. ఇంద్రునిసాక్ష్యము నీవెట్లునమ్మెదవు? నా యొద్ద కుండలములు లేవు. పో." అని కసరి, "సేవకా, యీ బ్రాహ్మణు నావలకుఁ బంపివేయుము." అని యాజ్ఞాపించి, తాను మేడమీఁదికిఁ బోయెను.

ఉదంకుఁడు శపింపఁజూచెనుగాని, యప్పుడుశపించినచో, దనతపస్సులోఁ గొంతతఱిగి పోవును గాన, శాంతించి, తక్కిన నాగనాయకులతో మాట్లాడి యాతరువాతఁ జూచుకొందమని యనుకొని, యైరావతుని యింటికిఁబోయి, యాతని నిట్లు స్తుతించెను.

ఉ. దేవమనుష్యలోకములఁ ద్రిమ్మరుచున్, విపులప్రతాపసం
    భావితశక్తిశౌర్యులు నహావిషోత్కటకోప విస్ఫురత్
    పావకతాపితాఖిలవిపక్షులు, నైనమహానుభావులై
    రావతకోటి ఘోరఫణిరాజులు మాకుఁ బ్రసన్నులయ్యెడిన్.

ఇట్లు స్తోత్రముజేసి, యాతని మనస్సుకరఁగించి, తక్షకునిచేతఁ గుండలము లిప్పింపుమని యాతనిఁ బ్రార్థించెను. ఐరావతుఁడు తక్షకునకుఁ జాలస్నేహితుఁడగుటచే, "భార్గవా, నిన్నుఁజూచిన నాకు జాలియగుచున్నది గాని, నా కాతఁడు

స్నేహితుఁడు. ఇట్టివిషయములలో నేను జోక్యము కలుగఁ జేసికొనను. మఱియొకచోటికిఁ బొమ్ము." అని చెప్పి పంపి వేసెను.

ఉదంకుఁడు వాసుకియొద్దకుఁ బోయి యాతని నిట్లు స్తోత్రము చేసెను.

చ. అరిదితపోవిభూతి సమరాహుల బాధలుపొందకుండఁగా
సురగణునెల్లఁ గాచిన మహోరగనాయకుఁడానమత్సురా
సురమకుటాగ్రరత్నరుచిశోభితపాదున కద్రినందనే
శ్వరునకు భూషణంబయినవాసుకి మాకుఁ బ్రసన్నుఁ
డయ్యెడున్.

తనకథయంతయును వాసుకితోఁ జెప్పెను. అతనిదయ సంపాదించెను. తనకుండలములు తనకువచ్చునట్లు చేయమని యాతనిఁ బ్రార్థించెను. వాసుకి దొడ్డవాఁడు. కావున, "సరే, నాకేమియు నభ్యంతరములేదు. మాఅన్నగారిని దర్శింపుము. వారెట్లు చెప్పిన నే నట్లు చేయవలసినవాఁడను." అని చెప్పెను.

ఉదంకుఁడు శేషునియొద్దకుఁ బోయి యాతని నిట్లు స్తుతించెను.

చ॥ బహువనపాదపాబ్ధికులపర్వతపూర్ణ సరస్సరిద్వతీ
సహితమహామహీభర మజస్రసహస్రఫణాళిఁ దాల్చి, దు
స్సహతరమూర్తి కిన్ జలధిశాయికిఁ బాయకశయ్యయైన య
య్యహిపతి, దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ
బ్రసన్నుఁడయ్యెడిన్.

అనంతుఁడు నాగనాయకులలో నత్యుత్తముఁడు. మహాభక్తుఁడు. ఉదంకునకుఁ గలిగినమహావిపత్తునకు మిక్కిలి విచారించెను. వాసుకిఁ బిలిపించెను. వారిద్దఱు నాలోచించుకొనిరి. తక్షకునకు నొక్కవర్తమానమంపిరి. రానని యాతఁడు మొండి వేసెను. కుండలము లైన నిచ్చివేయవలసినదని మరల వార్త నంపిరి. ఆసంగతి తనకేమియుఁ దెలియదని ప్రత్యుత్తర మంపెను. దండమునఁగాని యాతఁడు లొంగఁడని యిద్దఱును నిశ్చయించిరి. పెద్ద నాగసైన్యమును దీసికొని తక్షకపురము ముట్టడించిరి. భయముతో మాత్రమే తక్షకుని సేవచేయుచున్న యాతని యనుచరులు, సత్యస్వరూపులైన శేషవాసుకులను జూచుటతోనే, తమగృహములలోనే యుండి పైకి రాకుండిరి. నాగసైన్యములు తక్షకునియిల్లు ముట్టడివేసి, నాల్గుప్రక్కల నిప్పంటించిరి. పొగలు గ్రమ్ముచుండెను. మంట లెగయుచుండెను. తక్షకుఁడు భయపడి, కుండలములు బ్రాహ్మణునకిచ్చివేసి యన్నగారి పాదములు పట్టుకొని, క్షమింపుమని వేఁడుకొనెను.

అనంతుఁ డాతనిక్షమించి, మంటలార్పివేయ ననుచరుల కాజ్ఞ యొసంగి కుండలములు తీసుకొని శీఘ్రముగాఁ బొమ్మని బ్రాహ్మణున కనుమతి యొసంగెను.

బ్రాహ్మణుఁడు చాలకృతజ్ఞుఁడయ్యెను. కాని, గౌతమాశ్రమము సకాలమునఁ జేరుటకు వ్యవధిలేదని విచారించుచుండెను. శీఘ్రగమనముగల యొక గుఱ్ఱపుబండి యిచ్చి యనంతుఁడా బ్రాహ్మణుని గౌతమాశ్రమమునకుఁ బంపివేసెను.

# పదునొకండవ ప్రకరణము



## పరితాపము.



సుదాసునకు శాపవిముక్తి గలిగించుటకై విశ్వామిత్రుఁడు తపస్సు చేయనుద్దేశించి స్వాశ్రమమునకుఁ బోయెను. బ్రహ్మర్షి కానుద్దేశించి తానావఱకుఁ జేసినతపస్సంతయును వ్యర్థమైనది. వశిష్ఠునికుటుంబమును నశింపఁజేసి యాతనికి మనోవ్యధ కలిగించుటకై తాను చేసినప్రయత్నమే యాతనివో వినాశనమునకుఁ గారణము. ఇఁక మిగిలిన దేమి? విశ్వామిత్రుని తపోబలమును నమ్ముకొని వశిష్ఠునితో విరోధించినందున సుదాసునకుఁ గలిగిన రాక్షసత్వము. తపస్సుచేసి యిప్పుడు విశ్వామిత్రుఁడు సాధింపవలసిన దేమి? తానిప్పుడు సామాన్యమహర్షియై యున్నాఁడు. తపోధనము చాల వ్యర్థమైనది. కష్టపడి తపస్సు చేసి, తనపూర్వపుమహత్త్వము మరల సంపాదింపవలెను. ఆపైని, మరలఁ దపస్సుచేసి సుదాసునిరాక్షసత్వమును బోఁగొట్టవలెను. ఆపైని మరలఁ దపస్సుచేసి, వశిష్ఠునితో సమానుఁడు కావలెను.

ఆశ్రమమునకుఁ బోయి రెండుదినములు శాంతముగఁ గూర్చుండి యాలోచించుకొన్నప్పుడు విశ్వామిత్రునకుఁ దాను నిజేయవలసిన మహాకార్యము గోచరించినది. విశ్వామిత్రు

నిమనస్సున నొకవిధమైనసంచలనము కలిగినది. బహుకాలము తాను తపస్సుచేసి యలసిపోయి సాధించిన దేమి? వశిష్ఠునకుఁ గుటుంబనాశనము, సుదాసునకు రాక్షసత్వము. ఇంతేనా? దానివలనఁ దనకేమి వచ్చినది? అపకీర్తి. లోకమున కేమి లాభము కలిగినది.? ఏమియునులేదు. నష్టము కలదా? సుదాసునిపరిపాలనము తాఱుమాఱైనది. దానివలన ధర్మము నశించుచున్నది. కాఁబట్టి మిత్రముపైని దానిప్పుడు చేసిన పనికిఁ బర్యవసానము, తనకుఁ దపోవినాశనము; వశిష్ఠునకుఁ గుటుంబవినాశనము; లోకమునకు ధర్మవినాశనము. ఆహా, తాను తపస్సుచేసి సాధించినదిదియా? ఇదియేనా బ్రహ్మర్షిత్వము? ఈవిచారమున విశ్వామిత్రుఁడు మునిఁగి యుండెను. ఇప్పుడు తాను యథార్థమైనమనుష్యస్థితికి వచ్చియుండెను. మనుష్యస్థితి మధ్యమస్థానము. మనుష్యలోకము మధ్యమలోకము. ఈస్థితినుండి దేవత్వమా, యసురత్వమా పొందవలసియున్నది? కామక్రోధాదులకు వశుఁడైనచో అసురత్వము వచ్చును. శమదమాదులకు వశుఁడైనచో దేవత్వము వచ్చును. విశ్వామిత్రుఁడులోకమునుద్ధరింపవలసినవాఁడు. మనుష్యత్వమునుండి దేవత్వమును బొందఁదలఁచి మహాతపస్సుచేయుచున్నాఁడు. కాని, జారిపోవుచున్నాఁడు. పైకిఁబోయి, యాయున్నతస్థానమున నిలువలేకున్నాఁడు. కాని, యాతఁడు

మహాసామర్థ్యము కలవాఁడు. అట్టివానిని నిలువఁబెట్టినచో లోకమున కెంతయో మంగళము చేకూరును. భగవంతుని సహాయము కావలసిన మంచితరుణమిది.

విశ్వామిత్రుఁడు విచారమున మునిఁగియుండెను. రేలుం బగళ్లు విచారింపసాగెను. కర్తవ్యమేమి? ఇప్పుడు కర్తవ్యమేమి? నారదుఁడక్కడికి వచ్చెను. విశ్వామిత్రుఁ డొకమఱ్ఱిచెట్టుక్రిందఁ గూర్చుండి యాలోచించుకొనుచుండెను. నారదుఁడు వచ్చుచున్నాఁడని యెవ్వరో చెప్పిరి. లేచినిలుచుండి, కొంతదూరమెదురుగాఁబోయి, ప్రత్యుత్థానముచేసి, నారదుని సముచితాసనమునఁ గూర్చుండఁబెట్టి, చేతులు జోడించుకొని శిష్యభావమునఁ గూర్చుండెను.

నారదునకుఁ జాలసంతోషమయ్యెను. మహాప్రవాహ మొకటి, త్రోవయును దెన్నును లేక, యడ్డదిడ్డముగాఁ బాఱుచు, సముద్రములోఁ గలసిపోవుచుండ, బుద్ధిమంతుఁ డొకఁ డాప్రవాహము నరికట్టి, యొకజలాశయముగా నిలిపి, కాలువలు తీసి, నీరు నాల్గుదిక్కులకుఁ బాఱించి పాడిపంటల కనువైనట్లు చేసినచో లోకమున కెంత మంగళము చేకూరునో, యంతటిలాభము విశ్వామిత్రుని త్రోవలోఁ బెట్టినచోఁ గలుగ నున్నదనియు, నాపనిచేయుటకు మంచితరుణము నేఁడు లభించినదనియు నారదుఁడు మిక్కిలి యానందించెను.

"నాకిప్పుడు చాలవిచారముగా నున్న"దని విశ్వామిత్రుఁ డనెను.

"అవును, నేఁబోల్చుకొంటిని. కావుననే, నేను వచ్చితిని"

"నాతపస్సంతయును వ్యర్థమైపోయినది. మరల ఘోరమైన తపస్సు చేయవలసి యున్నది"

"అవును. నిజమేకాని, ప్రారంభించుటకు ముందుగా నాలోచింపవలసినవిషయ మొకటికలదు."

"ఏమది?"

"నేఁజెప్పునది బాగుగా నాలోచించుకొనుము. నీవు మొట్టమొదట తపస్వివి గాఁబోవుటకు ముందేమైయుంటివి?"

"రాజర్షినై యుంటిని."

"తపస్సునకుఁ గారణమేమి?"

"బ్రహ్మర్షిని గావలెనన్న సంకల్పము."

"బ్రహ్మర్షికిని, రాజర్షికిని భేదమేమి?"

"రజోగుణప్రధానులు రాజులు. సత్త్వగుణప్రధానులు బ్రాహ్మణులు. రజోగుణమును జగన్మంగళమునకై వినియోగించినవారు రాజర్షులు. సత్త్వగుణమును జగన్మంగళమునకై వినియోగింపవలసినవారు బ్రహ్మర్షులు."

"కావున, శిష్య రాజర్షిత్వమునుండి బ్రహ్మర్షిత్వమునకుఁ గావలసినచో నేమిచేయవలసియున్నది ?"

"రజోగుణమును విడిచి, సత్వగుణము సంపాదించి, దానిని లోకోద్ధరణకై వినియోగింపవలెను."

"వశిష్ఠుఁడు బ్రహ్మర్షియని యందురుగదా, ఆతఁ డట్లొనర్చెనా ?"

"ఆతనియందు పరిపూర్ణసత్వగుణము నెలకొనిపెట్టెను. తను విశ్వామిత్రుఁడు బాధించినను, వశిష్ఠుఁ డించుకంతయైనను చలింపలేదు, తానేశిష్యవర్గము నుద్ధరింపఁ దలఁచుకొనెనో వారికి మేలు కలిగించుటకై కాక, మఱియెవ్వరికైన నపకారము కలిగించుటకై యెన్నఁడు ప్రయత్నించెనా ?"

"నేను వినలేదు. కాని ఆతనికుమారుఁడేకదా సుదాసుని రాక్షసత్వమునకుఁ గారణము."

"సుదాసునకు శాపముగలిగినందుకై వశిష్ఠుఁ డెంత విచారించెనో నీ వెఱుఁగుదువా ?"

"నే నెఱుఁగను."

"సుదాసునకు శాపముకలిగినందుకై తాను విచారించుచు, కుమారుని మందలించుచుఁ, గోపబీజము కుమారుని యందుఁ గనఁబడుటచే నదినశించుటకై యథకమైనతపస్సు చేయవలసినదని కుమారు నాజ్ఞాపించెను."

చేసితివి. మరలఁ దపస్సు చేయుచుఁ, జేసకానివాగ్దాన మొనర్చి త్రిశంకుని క్రింద నది వ్యర్థము చేసితివి. మరలఁ దపస్సుచేయుచు, హరిశ్చంద్రుని జోలికిఁ బంతగించి వ్యర్థము చేసికొంటివి. తరువాత తపస్సంతయు సుదాసుని క్రింద వ్యర్థము చేసితివి.! ఏమియైన లాభము కలిగెనా? ఏమియు లేదు, నీకు బ్రహ్మర్షిత్వము వచ్చెనా? రాలేదు. మరలఁ దపస్సుచేసి యేమి చేసెదవు? ఇట్లే వ్యర్థముచేసెదవు. బ్రహ్మర్షిత్వము తపస్సు వలనమాత్రమే రాదు. వశిష్ఠునివలె సత్త్వగుణప్రధానుఁడ వైననే వచ్చును. కావున దానికి బ్రయత్నింపుము."

"అయిన, నిప్పుడు నాకర్తవ్యమేమి?"

"యస్మాన్నోద్విజతే లోకో, లోకాన్నోద్విజతే చ యః

హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః.

అట్టివాఁడే భగవంతునకుఁ బ్రియుఁడు. అట్టివాఁడే బ్రహ్మర్షి. కావున బ్రహ్మర్షివి కావలెనన్న, మొట్టమొదట నీవట్టివాఁడవు కావలెను."

"నాకు నెవ్వరిపైనిఁ గోపములేదు."

"వశిష్ఠునిపైనో,"

"కొంతయున్నది. నాబ్రహ్మర్షిత్వమున కతఁడే యడ్డు వచ్చుచున్నాఁడు."

"నీవుకూడ నతనివలెనే యైనచో"

"అనఁగా ?"

"అనఁగా, అతనికినీపైనిగోపమున్నదా ?"

"లేదనినీమాటలవలనస్పష్టమగుచున్నది."

"నామాటలవలనఁ గాదు. నీయనుభవము వలన !"

"నాఅనుభవమువలనఁ గూడ నట్లే యున్నది."

"అతనికి నీపైఁ గోపము లేదు. నీకాతనిపైఁ గోపమేలయుండవలెను.? ఉన్నచో నీకేమిలాభము !"

విశ్వామిత్రుఁ డాలోచించెను. వశిష్ఠునకు విశ్వామిత్రునిపైఁ గోపములేదు. విశ్వామిత్రునకు వశిష్ఠునిపై నేలకోపముండవలెను.?

"నిజమే. నిజమే— నాకోపమున కవసరములేదు. కాఁబట్టి యిప్పుడు నేను జేయవలసిన దేమి !"

"అహింసావ్రతము పూనుము."

"అనఁగా!"—

"అనఁగా—కర్మణా, మనసా, వాచా
సర్వభూతేషు సర్వదా,
అక్లేశవృత్తిర్యా ప్రోక్తా
త్వహింసా పరమర్షిభిః"

విశ్వామిత్రుఁ డించుక యాలోచించెను. ఇట్లనెను

"అవును నిజమే; నాకన్న వశిష్ఠుఁడే గొప్పవాఁడు. నాకోపము పోయినది. నే నహింసావ్రతము పూనితిని. నా కోపము పోయినది. వశిష్ఠుఁడే గొప్పవాఁడు. అతఁడే నిజమైన బ్రహ్మర్షి."

"ఈమాట వశిష్ఠునియొద్ద నొప్పుకొందువా?"

"తప్పక యొప్పుకొందును. నాకు బుద్ధివచ్చినది. నా కోపము పోయినది."

"పూర్తిగా నశించినదా?"

"పూర్తిగా నశించినది."

"మఱి యెప్పుడే విషయమునను గోపము నొందవు గద"

"నాకుఁ గోపమే లేదు. కోపగుణలేశమైన లేదు."

"ఈవఱకున్న కోపమునకుఁ బశ్చాత్తాపము నొందుచున్నావా?"

"పశ్చాత్తాపమా, నీ వేప్రాయశ్చిత్తము విధించిన నది చేసికొందును."

"ఏమియు నక్కఱలేదు. వశిష్ఠాశ్రమమునకు నాతోఁ గలసిరమ్ము. వశిష్ఠుని పాదములపైఁ బడుము. నీతప్పు నొప్పుకొమ్ము, క్షమింపుమని ప్రార్థింపుము. ఆతఁడు నిన్ను క్షమించును. ఆతని బ్రహ్మర్షిత్వము నీయందు సంక్రమించును."

"చిత్తము. ఇప్పుడునేను ధన్యుఁడనైనాను. పదండు. వశిష్ఠాశ్రమమునకుఁ బోదము."

ఇరువురును వశిష్ఠాశ్రమమునకు బయలుదేఱిరి.

# పండ్రెండవ ప్రకరణము

## వశిష్ఠాశ్రమము

నాఁడు వశిష్ఠాదులు సముద్రప్రాంతమునుండి బయలు దేఱినతరువాత నారదుఁడు కొంతదూరము వచ్చి తనకు వేఱుగాఁ బనియున్నదని చెప్పి, వశిష్ఠునియొద్ద సెలవు తీసి కొని, వెళ్లిపోయెను. వశిష్ఠుఁడును, గోడలును, పౌత్రుఁడు నాశ్రమములోఁ బ్రవేశించిరి. భార్యయును, గొడుకులును, గోడండ్రును లేనియాశ్రమమున బ్రవేశించినతోనే పూర్వపు సంగతులన్నియును జ్ఞప్తికివచ్చినవి. కాని, మనస్సిప్పు డాతని స్వాధీనముననే యున్నందున విచార మాతనికిఁ గలుగలేదు. దైవవిలాస మిట్లున్నదని మాత్ర మాతఁ డనుకొనెను. పండ్రెండుసంవత్సరములైనది తా నాశ్రమమునువిడిచి. అయి నను, తనశిష్యులైన శక యవన పహ్లవాదులు తనయాశ్రమ మును గనిపెట్టుకొని యుండి, యందలివృక్షములకును జంతువు లకు నేవిధమైనలోపమును గలుగకుండ సంరక్షించుచుండిరి. తమగురువుగారిరాకకై భగవంతునిఁ బ్రార్థించుచుండిరి. కొందఱు దేశదేశములు వెదకుచుండిరి. గురువుగారిజాడ తెలియకున్నను, నాశ్రమము నెవ్వరును విడువలేదు. హోమ

ధేనువు తల్లికంద్రుల నన్నదమ్ముల నొక్కసారిగాఁ గోల్పో యినబిడ్డవలె, నీళ్లు నాహారము నొల్లక కృశించియుండెను. ఆశ్రమములోనున్న వృక్షములును, జంతువులును, మనుష్యులును గూడ వశిష్ఠుని రాకకై పరితపించుచుండిరి. అట్టిస్థితిలో వశిష్ఠుఁడు కోడలితోఁ బౌత్రునితో నాశ్రమములోఁ బ్రవేశించినతోనే, యందఱకు నొక్కసారిగాఁ గరుణాసమిశ్రితమైనయానందము కలిగినది. జాలిచేతను, సంతోషముచేతను, కన్నులనుండి యొక్కసారిగా నందఱకును నీరుఁ జిప్పిల్లినవి. అందఱు నొక్కసారిగా వశిష్ఠునివైపు నాకాశమువైపును జూచిరి. వశిష్ఠునియందుఁ గూడ కరుణారసయుక్తమైన యానందమే కలిగెను. అతనికిఁ గూడఁ గన్నులనుండి నీరు కాఱెను. కొన్నినిమిషములవఱకు నంతయు నిశ్శబ్దముగా నుండెను. అందఱిహృదయము లేకభావములంది పరమేశ్వరునియందు లయించినవి. ఈశ్వరునిమహిమ గొప్పదని యందఱకు నొక్కసారిగానే తోఁచినది. ఇంతలో హోమధేనువు "అంబా" యనియఱచుకొనుచు వశిష్ఠునియొద్దకు వచ్చి యాతనిశరీరము నాకుచుండెను. అతనిముఖము చూచుచుండెను. "అమ్మయేదీ? అన్నగారేరీ" అని యడుగుచున్నదని వశిష్ఠుఁ డనుకొనెను. ఆతని మనస్సొక్కసారిగాఁ గరఁగిపోయెను. "నాబిడ్డా, యీశ్వరునివిలాస మట్లున్నది. అనుభవించుటతప్ప మనము మఱేమియుఁ జేయలేము." అని దువ్వుచు హోమధేనువుతో

వశిష్ఠుఁడు చెప్పెను. అదృశ్యంతి హోమధేనువును దువ్వెను. ధేనువామెను నాకెను. కొన్నిదినములలోనే యావును బరాశరుఁడును నేస్తము కట్టుకొనిరి. అన్నిటికన్న నరుంధతి లేనిలోపము గొప్పదిగాఁ గనఁబడెను. కుమారులకేమి. అంతటి వంతును బౌత్రుఁడు కలఁడు. కాని, గృహిణి లేకున్న గృహామే లేదు. ఉన్నను లేనట్లే— అందును, అరుంధతి. మహాపతివ్రత. అరుంధతిలేనివశిష్ఠుఁ డనఁగా, తావిలేనిపూవు. అరుంధతిని విడిచి వశిష్ఠుఁ డెట్లుండఁగలఁడు? సంసారమున గ్రొత్తవిచార మారంభమైనది. కాదు, ప్రాఁతవిచారమే మరల రేకెత్తినది. కాని, దైవవిలాస మట్లున్నదని యాతఁడు ధైర్యము నందెను. తీవ్రమైనతపస్సు చేసికొనుచుండెను. పరాశరునిచేత విద్యాభ్యాసము చేయించుచుండెను.

ఇంతలో నొకనాఁడాకస్మికముగ నారదుఁడును విశ్వామిత్రుఁడును దనయాశ్రమమునకు వచ్చిరి. విశ్వామిత్రుఁడు వశిష్ఠునిపాదములపైఁ బడెను. వశిష్ఠుఁడాతని లేవఁదీయఁ బ్రయత్నించెను. తన్నుక్షమించితినని చెప్పినఁగాని లేవనని విశ్వామిత్రుఁడు చెప్పెను. "క్షమించుట కవసరమే లేదు. నీవు నాకేమియపకారము చేసితివి?" అని వశిష్ఠుఁడనెను.

"లేదు. నీకు నేను జాలనపకారము చేసితిని. నీకష్టము లన్నిటికిని నేనే కారణము."

"వెఱ్ఱివాఁడా, నీ వేమి కారణము? ఈశ్వరుఁడు నన్నుఁ బరీక్షించెను. ఆయన పరీక్షకు నేనాగితినో లేదో యాయనకే తెలియును. నాకేమియుఁ దెలియదు. కాని నీవు నాకేమియును గష్టముకలిగింపలేదు."

"ఆహా, నీవే బ్రహ్మర్షివి. వశిష్ఠా, నీవే బ్రహ్మర్షివి. నిన్నుఁ జూచి, నాకోపము నశించినది. నారజోగుణము నశించినది. ఇఁక నేనెన్నఁడు నెవ్వరికి నపకారము చేయను. ఇదే ప్రమాణము. అహింసావ్రతము పూనితిని. నీపాదములే ప్రమాణము."

"విశ్వామిత్రమునీంద్రా! ఇప్పుడు నీవు బ్రహ్మర్షివైతివి. నేఁటినుండి నీవు బ్రహ్మర్షివే."

విశ్వామిత్రునిచరిత్రకు నారదుఁడుచాల సంతోషించెను. వశిష్ఠునికన్న విశ్వామిత్రునియందొక్క యాధిక్యము కలదు. వశిష్ఠునియందు బ్రహ్మతేజస్సుమాత్రమే యున్నది. విశ్వామిత్రునియందు క్షత్రియబ్రహ్మతేజస్సులు రెండును సంక్రమించియున్నవి. కావున విశ్వామిత్రునివలన భావికాలమున మహాకార్యములు కావలసియున్నవి.

నేఁడు విశ్వామిత్రవశిష్ఠులకుఁ గలిగినయీమైత్రి భావిభారతవర్షమునకు మంగళప్రదము. కావున నారదుఁడు సంతోషించుట భారతవర్షమంతయును సంతోషించుటయే.

"విశ్వామిత్రా! బ్రహ్మర్షిత్వము నీకు వచ్చినదా?"

"శమదయలవలన వచ్చినది."

"ఏమి తపస్సు చేసి సంపాదించితివి?"

"తపస్సేమి, శమదయలే."

"అహింసయే బ్రహ్మర్షిత్వమునకు మూలకారణము. నీకు బ్రహ్మర్షిత్వము కుదిరినదగదా, ఇంకఁ జేయవలసినది సుదాసుని శాపవిమోచనము. ఈ వశిష్ఠుతో యాపని చేయవలసియున్నది గావున నిపుడు మన మిరువురము మదయంతి యాశ్రమమునకుఁ బోదము."

వశిష్ఠవిశ్వామిత్రనారదులు మదయంతీయాశ్రమము నకు బయలుదేఱిరి.

# పదునూఁడవ ప్రకరణము

## ఋణవిముక్తి

ఉదంకుఁడు గౌతమాశ్రమమున కింకను రాలేదు. కుండలములను తెచ్చుకొనుటకై యుత్సాహపడుచు నహల్య తత్తరపడుచుండెను. ఆమెకేమో మనసులో నేదో భయ మగుచుండెను. సుదాసుని రాక్షసత్వమును గూర్చి యెఱిఁగిన వాఁడుగావున, నుదంకునకుఁ గలుగఁబోవుచున్న కష్టమును గూర్చి యాలోచించుకొనుచు, నాతనికే హానియు కలుగకుండ వలెనని గౌతముఁడు భగవంతునిఁ బ్రార్థించుచుండెను.

ఇంతలో నుదంకుఁడు వచ్చెను. గురువులకు నమస్కారములు చేసి కుండలములు గురుపత్నికి సమర్పించెను. అహల్య కుండలముల నందుకొని, భర్తగారికిఁ జూపి, జాగ్రత్తగాఁ గన్నుల నద్దుకొనెను. ఇంద్రుఁడు, శివుఁడు మొదలైనగొప్ప గొప్పవారికిఁగూడ, చేఁజిక్కని యమూల్యములైనకుండలములు తనశిష్యునిసామర్థ్యమునఁ దనకు లభ్యములైనందున, నహల్యకు సంతోషమును గర్వమును గూడ నొక్కసారిగానే కలిగెను. కాని యాసంతోషము నాగర్వము నొక్క నిముసము మాత్రమే నిలిచినవి.

"ఇంతయాలస్యమగుటకుఁగారణమేమి, భార్గవా," అని యహల్యయడిగెను. తనచరిత్రయంతయునువర్ణించియుదంకుఁడు చెప్పెను. తనయాత్మదానమునుగూర్చిమాత్రము దాఁచి యుంచెను.

"భార్గవా, నాకొఱకై చాల కష్టపడితివి. నాఋణము నీవు తీర్చుటకాదు. నీఋణమును నేను తీర్చుకొనుటయెట్లో నాకిప్పుడు తెలియకున్నది. కొడుకా, యెంతకష్టపడితివి! కొడుకా," యని పలుమాఱనుచు, నహల్య కన్నులనుండి నీరుకార్చుచు విలపింపసాగెను.

"భార్గవా, ఇన్నికష్టములు దాఁటి, మహాకార్యము నిర్వర్తించితివి. భృగువంశమునకు వన్నె తెచ్చితివి. భృగువంశమునఁ బుట్టినవారిలో నెవ్వరు నెవ్వరికిని దీసిపోరు. శుక్రుఁడు మృతసంజీవనీవిద్యను సాధించెను. ఔర్వుఁడు క్షత్రియయాగమును జేసెను. చ్యవనుఁడశ్వినుల నింద్రునితో సమానులను జేసెను. నీవు తక్షకుని జయించి యింద్రాదుల కలభ్యములైన యీకుండలములను దెచ్చితివి. మీపూర్వులకీర్తిని నీవు నిలుపుటయేకాక, దానికి మఱింత వన్నె తెచ్చితివి." అనిగౌతమునితో నిట్లనియె "అమ్మాయి పెండ్లికి సుముహూర్తము నిర్ణయింపుఁడు. భార్గవుని వేగము గృహస్థునిఁ జేసి పంపివేయుదము."

"దానికేమున్నది! ముహూర్తమును గూర్చి యీ వఱకే యాలోచించితిని."

"వివాహమును గూర్చిన ప్రశ్న మిప్పుడు మఱి యాలోచింప నక్కఱలేదు." అని యుదంకుఁడు మెల్లగాఁ జల్లగా ననెను.

"ఏమట్లనుచున్నావు! దానికొఱకే కదా యీకష్టము లన్నియును."

"ఏది దేనికొఱకైన నిప్పుడు మఱి యాతలం పవసరము లేదు."

ఏమి యేమని యహల్య యాత్రముగ నడిగెను.

"రాక్షసుఁడైన సుదాసునకు నాశరీరదానమును గూర్చి వాగ్దానము చేసివచ్చితిని. నావాగ్దానము నిర్వహించుకొనవలెను." అని యుదంకుఁడనెను.

అహల్యకు శరీరము వడఁకెను. నోట మాట రాలేదు. నేననుకొన్నట్లే యైనదని గౌతముఁడనెను.

"నన్ను మ్రింగివేయుట కాతఁడు మీఁదబడెను. కుండలము లిచ్చినచో నవి గురుపత్నికిచ్చి, మరలివత్తునని చెప్పితిని. కావున నేఁబోయి సుదాసున కాహారము గావలసియున్నది."

"మనకార్య మయిపోయినది గదా, యిప్పుడు పోక పోయిన నేమినష్టము! సుదాసుఁ డిక్కడకు రాఁగలఁడా, వచ్చిన నాతని భస్మముగాఁ జేసివేయనా?"

"వాఁడువచ్చుటతో నాకేమిపని? నేనే యాతని యొద్దకుఁ బోయెద నంటిని."

"పోకున్న నేమగును?"

"అసత్యమగును. అన్యాయమగును. అబద్ధమగును. ఏమైన నగును."

"గీ॥ వారిజాక్షులందు వైవాహికములందుఁ
బ్రాణవిత్తమానభంగమందుఁ
జకితగోకులాగ్రజన్మరక్షణమందు
బొంకవచ్చునఘముపొంద దధిప"

అని మీాశుక్రుఁడు బలిచక్రవర్తికి నుపదేశము చేసి యున్నాఁడు. అది మీాకుటుంబములోని యుపదేశముగదా, నీవిప్పుడు పాటించినఁదప్పేమి! స్వప్రాణరక్షణకై నాకేమి యును దెలియదని నీవు చెప్పుము. విప్రప్రాణరక్షణకై మాకే మియును దెలియదని మేముచెప్పెదము. పాతకము కలిగిన మనకందఱకును గలుగును. లేకున్న నెవ్వరికిని లేదు."

"గురువర్యా, తమతో వాదించుటకు నే నేపాటి వాఁడను? "బుధజనైర్వాదః పరిత్యాజ్యతామ్" అని పెద్దలు

చెప్పియున్నారు. అందును తమరు గురువులు. అయినను, నాకుఁ దోఁచినయొకమాట చెప్పెదను. శిష్యవాక్యమున దోషములున్న క్షమింపుఁడు. శుక్రునియుపదేశము క్షత్రియులకు గాని, బ్రాహ్మణులకుఁ గాదని నాయుద్దేశము. రాజులు లోకమును రక్షింపవలసినవారు. కావున లోకమంగళమునకై యొక్కొక్కప్పు డసత్యమాడియైన రాజ్యమును నిలుపుకొన వచ్చును. అది లోకోద్ధరణకై మాత్రమే కాని, యాత్మలాభమునకుఁ గాదు. బ్రాహ్మణుఁ డెన్నఁడు నసత్యమాడరాదు. బ్రాహ్మణత్వము సత్యముననే యున్నది. "సత్యేన సర్వమాప్నోతి, సత్యే సర్వం ప్రతిష్ఠితమ్॥" కావున అసత్యమే యాడినచో, వాఁడు బ్రాహ్మణుఁడు కానేకాఁడు. బ్రాహ్మణత్వము పోయినచో బ్రాహ్మణుఁడు నిప్పులేనిబొగ్గుతో సమానుఁడగును. సత్యమే బ్రాహ్మణత్వమయినప్పుడు, నేనాసత్యమును విడిచి, నాబ్రాహ్మణత్వము విడుచుకొందునా ? నాప్రాణములతో నాకేమిపని ? గురుపత్నీకార్యనిర్వహణార్థమై నాప్రాణము లర్పించితిని. గురుకార్యము తీఱినది. నాప్రాణసమర్పణమును బూర్తిచేసెదను." అని యుదంకుఁడు మనోధైర్యముతో నుపన్యసించెను.

గౌతమునకు సంతోషమును విచారము నొక్కసారిగానే కలిగెను.

"భార్గవా, శుక్రునియుద్దేశమును లెస్సగా గ్రహించితివి. నీవే నిజమైన బ్రాహ్మణుఁడవు. నాకానందమైనది. నిన్నుఁ

పరీక్షించుటకై యే నింతదూరము నిన్నుఁ బ్రశ్నించితిని. నీమనోధైర్యము నాకుఁ దెలిసినది. నీవు నీవాగ్దానమును నెరవేర్చుటకు ననుజ్ఞయిచ్చితిని. కాని, నీవు నాకొఱకై యీవాగ్దాన మీయవలసివచ్చినది. గావున నేఁబోయి యాసుదాసున కాహారమగుదును. నీవిక్కడనే యుండిపొమ్ము" అని గౌతముఁడనెను.

"అట్లుకాదు. అది నన్నుఁగూర్చివచ్చినదిగావున, నేఁబోయెదను. మీరిద్దఱు నుండిపొండు" అనియహల్యనొక్కి చెప్పెను.

"కాదు. కాదు. ఆవాగ్దానముతో మీకేమియును సంబంధములేదు. నాదే యీవాగ్దానము. నేనే నిర్వహింపవలెను. నేనే పోయెదను. మీకేమియును బ్రసక్తిలేదు." అని యుదంకుఁడని, లేచి నిలుచుండెను.

"నీవుపోయిన నేనుమాత్రముందునా? నేనును వత్తును. ఉభయుల నాతఁడు భక్షించునుగాక" అని గౌతముఁడును లేచినిలుచుండెను.

"నేనుమాత్ర మిక్కడనుందునా; సుదాసుఁడు నన్నుఁ గూడ భక్షింపనిండు." అని యహల్యయును నిలుచుండెను.

"నేనునువత్తు"నని గౌతమియును నిలువఁబడెను.

"మేమునువత్తుము, మేమునువత్తుము" అని యాశ్రమములోనున్న శిష్యులందఱును లేచి నిలువఁబడిరి.

ఉదంకుఁడు చేతులుజోడించి నమస్కరించి "అయ్యలారా, నన్నుఁబోనిండు. మీరందఱును సుఖముగా నుండుఁడు." అని ప్రార్థించెను.

"అందఱమును వత్తుము. మమ్మాటంకపెట్టవద్దు." అని యందఱును గట్టిగా ననిరి.

ఉదంకుఁడు ముందుబయలుదేఱెను. గౌతమాశ్రమములోనివారందఱును వెనుకనే పోవుచుండిరి.

---

# పదునాల్గవ ప్రకరణము

## శాంత్యాశ్రమము.

సాధువులకు బాధకలిగించినకారణమునఁ దనభర్తకు రాక్షసత్వము కలిగినదని, యారాక్షసత్వము నివారించుటకై సాధువ్రతము వూని మదయంతి శాంత్యాశ్రమమున నుండెను. తనయధార్థస్థితి తెలియక తన్ను మ్రింగివేయుటకు వచ్చుచున్న తనభర్తను, దనశాంతవచనములచేతను, శాంతపరిచర్యల చేతను, శాంతునిఁజేసి పంపుచుండెను. సాధువులకోపమువలనఁ దనభర్తకు రాక్షసత్వము కలిగినందున, సాధువులకటాక్షమపేక్షించి, యింద్రతక్షకాదిమహామహు లపేక్షించినను దానీయకుండిన కుండలములను సాధువునకు దానముచేసెను. శాంత్యాశ్రమమున మదయంతి యద్భుతమైనశాంతివ్రత మవలంబించెను.

సీ. శ్రవణసుఖంబుగా సామగానంబులు
  చదివెడుశుకముల చదువు తగిలి
కదలక వినుచుండు కరులును, గరికర
  శీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబు

కణముల చల్లనిగాడ్పానపడి వానిc
    జెంది సుఖంబున్న సింహములును,
భూసుర ప్రవరులు భూతబలుల్ దెచ్చి
    పెట్టు నీవారాన్న పిండతతులు
గడcగి భక్షింప నొక్కటc గలసియాడు
చున్న యెలుకలుc బిల్లులు నొండు సహజ
వైరివర్గంబులయు సహవాసమప్పుడు
సూచి.................

అనువర్ణనము శాంత్యాశ్రమముపట్ల యథార్థముగానే యుండెను. పిన్నతనమునుండి పెంచినకారణమునc బిల్లికూనల వలెc బెంచినవారివెంటc దిరుగు పులులను మనము చూచి యున్నాము. పరమశాంతిస్థానమగు శాంత్యాశ్రమమునc బరమప్రేమకు స్థానమగు మదయంతికరస్పర్శన మనుభవించిన ప్రతివ్యాఘ్రమును శాంతభావమును బొందుటలో వింతయేమి యును లేదు.

కణ్వమహర్షియాశ్రమమునకు దుష్యంతుcడు పోయి నప్పుడు,

చ. అతిరుచిరాగతుండయిన యాతనికిc హృదయప్రమోద మా
    తతముగc నవ్వనంబున లతాలలనల్ మృదులానిలావన
    ర్జితకుసుమాక్షతావళులు సేసలుపెట్టినయట్టులైరి; సం
    పతదళిసీనినాదమృదుభాషల దీవనలొప్ప నిచ్చుచుc.

ఆ దీవనలనందుకొనుచు నాతఁడు,

మాలిని

పచితనర్చితలిర్చిన క్రోవులనిమ్మగుతావుల జొంపములన్
బూచినమంచి యశోకములన్ సురపొన్నలఁబొన్నలఁ గేదఁ
గులన్,
గాచి జెడంగుగఁ బండిన యాసహకారములం గదళీతతులన్
జూచుచు వీనుల కింపెసఁగన్ వినుచున్ శుకకోకిల సుస్వర
ముల్.

కవి

చనిచనిముందటనాజ్యహవిర్ధృతసౌరభధూమలతాతతులం
బెనఁగినమ్రాకులకొమ్మలమీఁద నపేతలతాంతములై ననుబా
యనిమధుపప్రకరంబులఁజూచి జనాధిపుఁడంత నెఱింగెఁదపో
వనమిది యల్లదె దివ్యమునీంద్రుని వాసము దానగునంచు
నెడన్॥

అని కవి వర్ణించియున్నాఁడు.

మదయంతి తనయాశ్రమమునందలి తరుగుల్మలతాదుల యందును, పశుపక్షిమృగాదులయందును, బరమప్రేమచూపు చుండెను. ఆప్రేమకుఁ గారణమేమి ? అవి తనపోషణాలో నున్నందునఁ బోష్యవర్గముపై ప్రభువులు చూపవలసినసహాను భూతియా ? కాదు. అవి నిత్యమును దనకానందము

కలిగించుటచేఁ దనచేతులతో స్వయముగ వానిమంచిచెడ్డలు తాను విచారించుచున్నందునఁ దానివలనఁ గలిగినపుత్త్రపుత్త్రికాసోదరసోదరీభావమా ? కాదు. వానికష్టసుఖములే తన కష్టసుఖములని భావించి, వానికి దేనివలననైన నేమాత్రమైన కష్టముకలిగినచోఁ దనకుఁ గలిగినట్లే విచారించుచు, ప్రతిక్రియచేయుచు, వాని కేరీతిగనైన నానందము కలిగినచో నది తనకే కలిగినదిగా నెంచి, వానితోఁబాటు తానుగూడ నానందించుటవలనఁ గలిగిన యేకత్వమా ? అదియును గాదు. తనయందును, సకలభూతములయందు నొక్కరీతిగానే వ్యాపించియున్న పరమేశ్వరుని లీలావిశేషములే, క్షణక్షణమును దనతరుగుల్మలతాదులయందును బశుపక్షిమృగాదులయందునుఁ గనఁబడుచుండుటచే నంతర్యామియైనపరమేశ్వరుని యందుఁ దనకుఁగలభక్తియే ప్రకృతిపురుషస్వరూపములైన యీయన్నిటియందును దనకు జనించి, యది పరమప్రేమగా మాఱి, వానిని బ్రేమించునట్లు చేసినది. తనయాశ్రమము నందలి దేనినిదానుజూచినను, బ్రకృతిసౌందర్యమును, బురుషుని మహిమమును నొక్కసారియే తనకుఁ బొడచూపి, తన చిత్తమును బ్రహ్మానందమయముగాఁ జేయుచుండెను. అట్టి పరమప్రేమస్వరూపిణియై మదయంతి భర్తృశాపవిమోచనమునకై ఘోరతపస్సు చేయుచుండెను.

అవకాశమైనప్పుడెల్ల భర్తను సమీపించి, శాంతవాక్యములచే నాతని శాంతింపఁజేసి, పూర్వస్మృతి కొంచెము కలిగించుచుండుటచే, నితరస్థలములలో నతిభయంకరుఁడుగా నున్న సుదాసుఁడు మదయంతియొద్ద శాంతుఁడుగా నేయుండెను. కావున నీ రాక్షసత్వము పోవుట కెప్పటికైన నవకాశమున్నదని ధృఢమైనవిశ్వాసముతో నామెయుండెను.

ఇట్లుండఁగా, నొకనాఁడు నారదవిశ్వామిత్రవశిష్ఠులు మదయంతియాశ్రమమునకు వచ్చిరి. ప్రేమరసము మూర్తీభవించియున్నయాయాశ్రమమును జూచి వారందఱు నాశ్చర్యపడిరి. మూర్తిత్రయమువలె వచ్చియున్నమునిత్రయమునకు సాష్టాంగనమస్కార మొనర్చి, మహాత్ములు మువ్వురు నొక్కసారియే దర్శనమిచ్చినందు కానందించితి ననిచెప్పి, వశిష్ఠునకుఁ గలిగినయాపదకై తనపరితాపమును దెల్పెను. అజ్ఞాతముగఁ దనభర్తయొనర్చినయపరాధమును క్షమింపవేఁడుకొని, దానికిఁ దానేమిప్రాయశ్చిత్త మనుభవింపవలసియున్న ననుభవించెద ననిచెప్పెను.

విశ్వామిత్రుఁ డామాటనందుకొని "అమ్మా, నీవేమియును ప్రాయశ్చిత్త మనుభవింప నక్కఱలేదు. నీతపస్సే నీభర్తకు శాపవిమోచనము కలిగింపఁగలదు. నీవంతును నావంతును, నేనే ప్రాయశ్చిత్త మనుభవించితిని. నీభర్తను నాపశ్చాత్తాపము వలన వశిష్ఠుఁడు నన్నుక్షమించెను. గూడక్షమింపనున్నాఁడు" అనిచెప్పెను.

"ఆతనికొక్కలోపము కలిగినది. దానిని దీర్చ నాతరమైనది కాదు." అని నారదుఁడనెను.

"అరుంధతిలేనిలోపము నాకు నిజముగాలోపమే, కాని, నేను విచారింపలేదు. దైవవిలాసమునకు మనమేమిచేయఁగలము." అని వశిష్ఠుఁడనెను.

"అక్కయ్యా," యని మదయంతిగట్టిగాఁబిలిచెను. లోనుండియెవ్వరోయొకస్త్రీ యెదుటఁ గన్పట్టెను. అందఱు నాశ్చర్యపడిరి. "అరుంధతి" యనివశిష్ఠుఁడు గట్టిగా ననెను. అరుంధతి వశిష్ఠునిపాదములు పట్టుకొనెను.

"ఎక్కడనుంటి విన్నాళ్లును, ఎట్లుజీవించితివి?" అని వశిష్ఠుఁ డడిగెను.

"సుదాసుఁడు నన్ను గట్టిగాఁ బట్టుకొని బీల్చివేయఁ దలఁచెను, గాని, యీస్త్రీరత్న మక్కడకు వచ్చి, యాతని చేతులలో నుండి నన్ను దప్పించినది. రక్తము విస్తారముగాఁ బోయి యుంటచే నేను మూర్ఛిల్లితిని. తెలివివచ్చుసరికి నే నీయాశ్రమమునందుంటిని. చాలకష్టపడి, యౌషధసేవవలనను, పథ్యపానాదుల వలనను, మనోహరకథాకథనము వలనను, ఈసాధ్వి నాకుఁ బ్రాణదానము చేసెను." అనిచెప్పెను.

"నావిధిని నేను నెరవేర్చితిని గాని హెచ్చేమియును జేయలేదు. అవకాశమున్న నందఱను బ్రతికించియుందును.

కాని, నేను పోవునప్పటికే కొన్నిహత్యలు ముగిసినవి. నా భర్తను శాంతపఱిచి, యాతనిస్వాధీనుని చేసికొనునప్పటికి, మఱి కొన్ని హత్యలు జరిగిపోయినవి. చివరకు నే నీగురుపత్నిని మాత్రమే రక్షింపఁ గలిగితిని. కావున, నేనుజేసిన యీస్వల్ప సేవకు నన్ను స్తుతింపనక్కఱలేదు." అని మదయంతి వినయ విధేయతలతోఁ బలికెను.

కోడలిని, పౌత్రుని, నారదమహర్షి రక్షించెనని విశ్వామిత్రుఁడు చెప్పెను. "అట్లైన నాకుఁ జాలసంతోషముగా నున్నది. వంశము నశింపలేదు. మాకు గురుకుటుంబము నిలిచినది." అని మదయంతి మరల సంతోషించెను.

వశిష్ఠారుంధతులు మదయంతిని జేరఁదీసి యాశీర్వదించిరి. మనమందఱమును సుదాసునొద్దకుఁ బోయి యాతని శాంతింపఁజేసి, యాతని రాక్షసత్వమును దీసి వేయుదమని నారదుఁడుచెప్పెను.

"సరే," యనియందఱును బయలుదేరిరి.

---

# పదునైదవ ప్రకరణము

## సుదాసుని బస

రాక్షసత్వము వచ్చినప్పటినుండియును సుదాసుఁ డొక పర్వతగుహాలో నివసించుచుండెను. చుట్టుప్రక్కలనున్న వారు లను గాచి, పార్వతీయుల నాభీరులఁ జంపి, యా శవముల నా గుహాలోఁ బెట్టుకొని, తినుచుండెను. కావున, ఆదారిని మనుష్యులు సంచారములు చేయుట మానివేసిరి. కొంతదూరములోనే శాంత్యాశ్రమము కలదు. అక్కడకుఁ బోవుటకు సుదాసుఁడు భయపడుచుండెను. కావునఁ గొంచెము చుట్టైనను బాలవారు లా శాంత్యాశ్రమము ప్రక్కనుండి పోవుచుండిరి. ఉదంకుఁడు సుదాసునకు నిజశరీరదాన మొనర్చు వాగ్దాన మొనర్చి, దాని నిర్వహించుటకై యింకను రాలేదు.

సుదాసుఁడు కోపము నందుచుండెను. ఉదంకుని శాంతియుక్తమైన ధైర్యమును జూచినప్పుడు సుదాసునకుఁ గొంచెము పూర్వస్మృతి కలిగియుండెను. రాక్షసత్వము తాత్కాలికముగాఁ గొంత తగ్గియుండెను. కాని, వెంటనే యది మరలఁ గ్రమ్ముకొనెను. ఆదారిని మనుష్యుల రాకపోకలు తగ్గుటచే

సుదాసునకు మనుష్యమాంస మపురూప మయ్యెను. మనుష్యమాంసమునకై —అందును—బ్రాహ్మణమాంసమునకై, వాచిపోవుచుండెను. ఉదంకుఁ డింకను రాలేదు. "ఛీ, యేమి నాబుద్ధిలేనితనము? చేఁజిక్కిన వానిని విడువవచ్చునా? అరు వారుకాసులకన్న రొక్కము మూఁడుకాసులు మేలుకదా! వచ్చునో, రాఁడో! ఏలవచ్చును? ఒడ్డుచేరినపైని గడ్డవైపెవ్వఁడైనఁ జూచునా? నా యవసర మిప్పుడు వాని కేల కలుగును? కానీ, కానీ, నేను వానిని విడుతునా? నన్నుఁ గన్నొఱఁగి వాఁ డెంత దూరము పోఁగలఁడు?" అని వితర్కించుకొను చుండెను. ఊహపై నూహ కలుగుచున్న కొలఁదియును కోపము హెచ్చుగుచుండెను. కోపము హెచ్చుగుచున్నకొలఁదియును రాక్షసత్వము హెచ్చుగుచుండెను. ఇంతలో నుదంకుఁడును గౌతమాశ్రమములోనివారును దూరమున వచ్చుచున్నట్లు కనఁబడెను.

"ఆఁ! అదిగో వచ్చుచున్నాఁడు! అన్న! బ్రాహ్మణుఁ డెంతపనిచేసెను. నన్నుఁ జంపించుటకే కాఁబోలు, నింత పరివారమును దీసికొని వచ్చుచున్నాఁడు! వారి చేతులలోఁ గఱ్ఱలు కనఁబడుచున్నవే! నన్నుఁ గొట్టుటకేనా? కాదు కాదు. అవి బలముగల కఱ్ఱలు కావు. బ్రాహ్మణుల దండములు. వీరును బ్రాహ్మణులవలెఁ గనఁబడుచున్నారు. ఈదండములతో

నీ బ్రాహ్మణులు నన్నుఁ గొట్టి చంపఁగలరా? ఏమి వీరి సాహసము!'' అని యాతఁ డనుకొనుచున్నంతలో నందఱును వానిని సమీపించిరి.

"ఆలస్యమైనది కాఁబోలు; సుదాసా, పాపము; నీకెంత యాఁకలి యగుచున్నదో! రమ్ము! వేగముగా నన్ను భక్షించి నీయాఁకలి దీర్చికొమ్ము. ఆలస్యము చేసినందుకు క్షమింపుము." అని యుదంకుఁడు శాంతముగ ననెను.

ఉదంకునిఁ జూడకముందు కోపముతో మండిపడుచు, నాతఁడు కనఁబడిన నాతనిఁ జీల్చి చంపెద ననుకొనుచున్న సుదాసునకు యాతని శాంతముఖము చూచినతోనే, యాతని శాంతవాక్యము లాలకించినతోనే, యాతని యాత్మత్యాగము తెలిసికొన్నతోనే, మనస్సు చలించెను. ఇంద్రియములు తమ తమ పనులు మాని యాతని నట్టె నిలువఁబెట్టెను. పెద్దనిట్టూర్పొకటి యాతఁడు విడిచెను. మరల పూర్వస్థితికి వచ్చెను.

ఏమైన నైనది. సరే, వచ్చితివికదా, కాని, వీరి నందఱి నేల తీసికొని వచ్చితివి?

"వీ రందఱు నాకు గురువులు. నన్ను విడువలేక వచ్చినారు. వీరివలన నీ కేమియును బ్రమాదము లేదు. రమ్ము. నన్ను భక్షింపుము."

సుదాసుఁ డుదంకునిఁ బట్టుకొనుటకై వచ్చుచుండెను. గౌతముఁ డడ్డముగా నిలుచుండెను.

"ఈ ముసలివాఁ డేల యడ్డముగా నున్నాఁడు ?"

"సుదాసా, మదయంతీప్రాణవల్లభా, సమ్రాడ్వరేణ్యా," యని గౌతముఁ డారంభించెను.

"నేను సుదాసుఁడనే; మదయంతి నా భార్యయే. కానని యెవ్వరనఁగలరు ? కాని, అదేమి యా చివరమాట?...... ఏదేదీ మరలఁ జెప్పుము !"

"సమ్రాడ్వరేణ్యా"

"అనఁగా, మహారాజనియా యర్థము?"

"అవును, నీవు మహారాజవు."

"ఛీ, ఛీ, యెవ్వరన్నారు. నేను రాక్షసుఁడను. మనుష్యమాంసము నాకుఁ గావలెను."

"నీవు రాక్షసుఁడవు గావు; మనుష్యులను దినివేయవలసినవాఁడవు గావు. మహారాజవు. మనుష్యులను బరిపాలింపవలసినవాఁడవు." అని గౌతముఁ డనెను.

సుదాసునకుఁ బూర్వస్మృతి కలిగెను. ఇంచుకసేపాలోచించెను. కాని, మరల నది గ్రమ్ముకొనెను. "ఆఁకలివేయు

చున్నది. రమ్ము, భార్గవా, తొలుత నిన్నుఁ దిని, తరువాత నాలోచించుకొందును".

"నేను సిద్ధముగానే యున్నాను" అని యుదంకుఁడనెను.

"నేను పెద్దవాఁడను. ముందు నన్నుఁ దినుము" అని గౌతముఁ డనెను.

"నిన్నుఁ జూచిన నాకేమో యగుచున్నది. నావరాత్రమము తగ్గుచున్నట్లున్నది. నీవు వలదు."

"పోనీ, నన్నుఁ దినుము" అని యహల్య ముందుకు వచ్చెను. సుదాసుఁ డాలోచించెను. "నీవు వలదు. అరుంధతిని తినవలెనని పట్టుకొన్నప్పుడు మదయంతి యడ్డువచ్చినది. మదయంతినిఁ జూచిన నాకు భయము. ఆడుదానిని మఱలఁ బట్టుకొన్న, మదయంతి వచ్చునేమో, దాని కంటఁ బడకుండఁ దిరుగవలెనని నా యుద్దేశము. కాఁబట్టి నీవు నాకు వలదు."

"పోనీ, నేను—" అని గౌతమి వచ్చెను. నేను, నేను, అని గౌతమాశ్రమవాసు లందఱును ముందుకు వచ్చిరి.

"ఏమి యీ వేలము వెఱ్ఱి! మా రాక్షసు లందఱును, ఒకనిఁ దినవలసివచ్చినప్పుడు నేను, నేను, అని వత్తురుగాని,

తనొక్కఁడు తినవలసివచ్చినప్పుడు చల్లచల్లఁగ జారిపోవుదురు. ఇది యేమి యీ వెఱ్ఱి? ఇట్టి వెఱ్ఱి నే నెక్కడను జూడలేదు."

"ఇది యహింసావ్రతము."

"ఇది యేమి, యీ వ్రతము! ఒకనిఁ జంపుకొని తినవలెను గాని, తా నొకనికి భోజనమైనచో, నీప్రపంచ మేల!"

"అట్లు కాదు. రాక్షసులను మనుష్యులనుగాఁ జేయవలసివచ్చినప్పు డీ వ్రతము నవలంబింతుము"—అని గౌతముఁ డనెను.

"అయినను మీరు నన్ను మనుష్యునిఁగాఁ జేయుదురా యేమి! నాకు వలదు."

"నీవు మనుష్యుఁడవే. మనుష్యుఁడవే. ముమ్మాటికిని మనుష్యుఁడవే. కాని, నీయందుఁ గోపగుణము ద్రేకించుటచే నీవు రాక్షసుఁడవుగా మాఱినావు. ఆకోపము తగ్గినతోనే మఱల మనుష్యుఁడవగుదువు. మనుష్యులు నీకు సోదరులు. వారిని నీవు తినవలసిన వాఁడవుకావు. పరిపాలింపవలసిన వాఁడవు"

"నేను మనుష్యులను దినవలసినవాఁడనుగానా? పరిపాలింపవలసిన వాఁడనా? యేమేమీ!" అని, సుదాసుఁ డాలోచింపసాగెను.

ఇంతలో, నారదవిశ్వామిత్రులును, వశిష్ఠారుంధతు లును, మదయంతియు నక్కడికి వచ్చిరి. మదయంతి భర్తకు నమస్కారముచేసెను. అందఱును గౌతమునకు నమస్కరించిరి.

"నేను మనుష్యులను దినవలసినవాఁడనుగాను, వారిని బరిపాలింపవలసిన వాఁడనా? ఈముసలిబ్రాహ్మణుఁడను చున్నాఁడు. నీవేమందువు, మదయంతీ?" యని సుదాసుఁ డడిగెను.

"నిజమే, నీవు మనుష్యుఁడవే" యని మదయంతి యనెను.

"నిన్నుఁ జూచినప్పుడు నా కట్లే తోఁచుచుండును. కాని, నీవు లేనప్పుడు నాకు మనుష్యులను తినవలెనను బుద్ధి పుట్టుచుండును."

"నీవు మనుష్యుఁడవు. మనుష్యులను బరిపాలించు మహారాజవు. సూర్యవంశసంభూతుఁడవు. నీవు రాక్షసుఁడవు కావు" అని నారదుఁడనెను.

"ఇప్పుడు నాకుఁ బూర్వస్మృతిబాగుగా వచ్చినది. నేను వశిష్ఠుని శిష్యుఁడను. ఆతని కుమారునిఁ గొట్టితిని" అని సుదాసుఁడనెను.

"కావుననే, నీయందుద్రేకించిన కోపగుణము నిన్ను రాక్షసునిఁగాఁ జేసినది. వశిష్ఠునకుఁ గులవినాశముచేసి యప కారమొనర్చితివి.

"ఓహో, యిదియా నేను జేసినపని ? ఎంతపని చేసితిని! నేను జేసినపనికి నాకుఁ జాలవిచారమగుచున్నది."

"పశ్చాత్తాపము కలుగుచున్నదా ?"

"తీవ్రమగు పశ్చాత్తాపము కలుగుచున్నది."

"ప్రాయశ్చిత్తము పొందెదవా ?"

"నీవెవ్వరు ?"

"నేను నారదుఁడను"

"ఓహో, అట్లా ? సరే, నీ వే ప్రాయశ్చిత్తము విధిం చిన నది పొందెదను.

"ఇదిగో వశిష్ఠుఁడు. ఈయన పాదములపైఁబడి క్షమింప వేడుకొనుము."

సుదాసుఁడు వశిష్ఠుని పాదములంటెను. పూర్వస్మృతి బాగుగా వచ్చెను. "వశిష్ఠమహామునీంద్రా! నాయపరాధము క్షమింపుము" అని పాదములను గట్టిగాఁ బట్టుకొనెను.

వశిష్ఠుఁడాతనిఁ గౌఁగిలించుకొనెను. అరుంధతి యాతని శిరస్సుపైఁ జేయివైచెను. "సుదాసా, నీరాక్షసత్వము పోయినది. నీవిప్పుడు మఱల రాజర్షివైతివి. మఱి ధర్మయుక్తముగా భూమిని బాలింపుము." అని వశిష్ఠుఁడనెను.

అందఱును, తథాస్తు—తథాస్తు—అనిరి.

నారద, వశిష్ఠ, గౌతమ, విశ్వామిత్రులు చాల సంతోషించిరి. సుదాసుఁడును, మదయంతియును, మహానందము నందిరి.

పెద్దముత్తైదువ యరుంధతి బ్రహ్మానందము నందెను.

# పదునాలవ ప్రకరణము

## ఉపన్యాసము.

నారదుఁడు నిలిచియుండెను. అందఱను గూర్చుండఁ జెప్పెను.

"ఆర్యులారా, ఇంచుక నేను జెప్పవలసిన మాటలు కొన్నిగలవు. క్షమించి, కొంచెమోపికచేసి, శ్రద్ధగావినుఁడు. ఇందఱు మహానుభావులిక్కడ నొక్కసారి సమావేశమైనారు. ఇట్టి సమావేశములు తఱచుగా జరుగుట కవకాశముండదు; కావున, నిట్టి తరుణములోనేఁ గొన్నిమాటలు చెప్పినచో నవి లోకమునకు మంగళప్రదమగును. సుదాసున కసురత్వము వచ్చుట భావికాలమున లోకమునకు రాఁబోవు మహావిపత్తును సూచించుచున్నది. అచిరకాలమున లోక మనుజుల పాలు కావలసియున్నది. వశిష్ఠునివంటివాఁ డాత్మహత్యకుఁ బూనుట ధర్మలోపమువలన మహాత్ములు తమ జీవితమునందుఁ బొందఁ బోవు నిరాశను సూచించుచున్నది. అచిరకాలమున లోకమునకు రాక్షసులు ప్రభువులగుదురు. కామక్రోధాధుల ప్రభుత్వము హెచ్చగును. శమదమాదులైన దేవగుణము లణఁగిపోవును.

యదాయదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం.

అని యున్నదిగావున, ధర్మమును దిరుగ స్థాపించుటకై మహాత్ముఁడొకఁ డవతరింపవలసియున్నది. ఆ మహాత్ముఁ డవతరించుటకు ముందే, యాతనిమార్గమును మన మంతఱమును సరళముగాఁ జేయవలసియున్నది. జాతి మత పక్షపాతములేక, దుష్టశిక్షణమును, శిష్టరక్షణమును జేయవలసిన మహారాజు రాక్షసుఁడైనప్పుడు, కేవల క్షత్రియ తేజస్సుగాని, కేవల బ్రాహ్మణ తేజస్సుగాని, వా యసురత్వ మంతరింపఁజేయ లేదు. కావున, బ్రహ్మక్షత్రియ తేజస్సుల సమ్మేళనము కావలసియున్నది. ఈ సమ్మేళనము రెండుమార్గములలో నిప్పుడు జరుగుచున్నది. బ్రాహ్మణుఁడైన పరశురాముఁడు క్షత్రియత్వ మవలంబించెను. కావున నాతనిలో బ్రాహ్మణ తేజస్సున క్షత్రియ తేజస్సు సంక్రమించినది. క్షత్రియుఁడైన యీ విశ్వామిత్రుఁడు బ్రాహ్మణత్వ మవలంబించెను. కావున, నీతనిలో క్షత్రియ తేజమున బ్రాహ్మణ తేజము సంక్రమించినది. ఈ బ్రాహ్మణ క్షత్రియ తేజస్సును, క్షత్రియ బ్రాహ్మణ తేజస్సును రెండును గలసి, ముందురావలసిన మహాత్మునియందు సంక్రమింపవలసియున్నది. మన మప్పటికి జీవించిన జీవింపవచ్చును. లేకున్న

లేకపోవచ్చును. ధర్మమునువిడిచి మన ముండఁగూడదు. ధర్మయుక్తముగా మనముచేయు ప్రతి తపస్సును, ధర్మయుక్తముగా మనమాడు ప్రతివాక్యమును, ధర్మయుక్తముగా మనముచేయు ప్రతికార్యమును, ఆ మహాత్ముని యవతారమునకును, ఆతనియందీ యుభయ తేజస్సుల సంక్రమణమునకును, సహాయభూతముగా నుండవలెను. లోకమంతయు నేక మనస్సుతో నట్టిమహాపురుషుని యవతారమునకై ప్రతీక్షించుచున్నచో, నచిరకాలములోనే యాతఁడవతరించి, యసురత్వ మంతరింపఁజేయును. నే నెంత తపస్సుచేసియో యీ విషయ మిట్లు నిర్ధారించుకొంటిని. మీరు నాతో నేకీభవించినచో నా ప్రార్థన ననుసరింపుఁడు. భావిజగదభ్యుదయమునకు నీవిశ్వామిత్రుఁడు ప్రధానుఁడు. పరశురాముఁ డొకఁడీతనికిఁ దోడు కావలసియున్నది. వశిష్ఠారుంధతులయు, గౌతమునియుఁ, దపస్సీతనికి సహాయము కావలసియున్నది. మదయంతి తన తపస్సంతయును ధారపోసినచో, సుదాసుఁడు ధర్మమార్గమునఁ బరిపాలించుచున్నచో, నా మహాత్ముఁడు వీరికుటుంబముననే యవతరించును. ఇది నాయుద్దేశము. ఆపైని మీచిత్తము, లోకభాగ్యము." అని నారదుఁడు కూర్చుండెను.

"మా తపస్సులను మేమందుకైయే వినియోగించుచున్నాము." అని యందఱుననిరి.

తమ కుటుంబమున శోకము నుద్ధరించు మహాత్ముఁడు పుట్టుటకుఁ గావలసిన వ్రతములు తాము చేసెదమని మదయంతి మదాసులనిరి. అందఱును తథాస్తు, తథాస్తు, అనిరి.

గౌతమికిని, ఉదంకునకును, వివాహము మదయంతి సమక్షమున జరిగినది. ఉదంకుని స్వార్థత్యాగమునకై యందఱును సంతోషించిరి.

భావికాలమున నతనివలన మహాకార్యమొకటి లోక క్షేమమునకై కావలయునని యందఱును నాశీర్వదించిరి.

---

# పదునేడవ ప్రకరణము



## తరువాత



నారదుని యుపన్యాసానంతరము, ఉదంకుని వివాహ ముసు జూచి సంతోషించి, యెవ్వరిస్థానములకు వారుపోయిరి.

సుదాసుఁడు మరల మహారాజై, మదయంతితోఁ దనరాజ్యమును వశిష్ఠనియుక్తుఁడై ధర్మయుక్తముగాఁ బాలించుచుండెను.

గౌతముఁడు నిజాశ్రమమునకుఁ బోయి, మహాతపస్సు చేసి, నివ్వరినుండి కోఁతనరివండించు విధానమును గనిపెట్టి గోదావరీనదీతీరపు భూములలో ధాన్యవ్యవసాయముచేయుచు, క్షామమున భోజనలోపము ప్రజలకుఁ గలుగకుండఁ జేయు చుండెను. పరశురాముఁడు క్షత్రియవినాశనముచేసి, యలసి, పశ్చాత్తప్తుఁడై బ్రహ్మతేజోయుక్తమైన తనధనుస్సును ధరింపఁ గల మహాత్ముని యవతారమునకై ప్రతీక్షించుచుండెను. విశ్వామిత్రుఁడు శాంతుఁడై, మహాతపస్సుచేసి, బ్రహ్మక్షత్రియ తేజస్సులు సంక్రమించిన బల, అతిబల, అను రెండు మహా

విద్యలు సాధించి, అవి యుపదేశమునంది లోకము నుద్ధరింప గల మహాత్ముని యవతారమునకై ప్రతీక్షించుచుండెను.

రావణుఁడు జన్మించెను. అసురవిద్యలు ప్రబలినవి. దేవవిద్యలు నశించినవి. ధర్మ భంగమైనది. శ్రీరాముఁ డవతరించెను. విశ్వామిత్రుఁడు తనవిద్యల నుపదేశించి ధన్యుఁ డయ్యెను. పరశురాముఁడు తనధనుస్సును, దేజస్సును సమర్పించి, కృతార్థుఁడయ్యెను. ఆధనుస్సు సాహాయ్యమునను, ఆవిద్యలసాహాయ్యమునను, శ్రీరాముఁడు రావణుని సంహరించెను. అసురు లంతరించిరి. అసురగుణము లడఁగిపోయినవి. దేవగుణములు మరల రేకెత్తినవి. నారదుని యుద్దేశము సఫలమైనది. మహావిప్లవానంతరము లోకమున మరల శాంతి చేకూరినది. ధర్మము వృద్ధినొందసాగినది.

ఉదంకుఁడు సమబుద్ధిగలిగి, యనార్యులాక్రమించి యున్న మరుభూమిని దనయాశ్రమము కల్పించుకొని, వారిని నాగరకులనుగాఁ జేయుచుఁ దపస్సుచేసికొనుచుండెను. కౌరవ పాండవులకుఁ గలిగిన మహాయుద్ధమునకును, దానివలన లోకమునకుఁ గలిగిన మహానష్టమునకును, విచారించెను. శ్రీకృష్ణునివంటివాఁడు సంధిచేసి శాంతి నెలకొల్పలేకపోయె నందుకుఁ బరితాపమునందెను. తక్షకుని దుష్టత్వము మితి

మీరుటచే, అప్పటి మహారాజైన జనమేజయునిచేత సర్ప యాగము చేయించెను. దుష్టనాగులను వధింపించెను. నాగ జాతి ఆర్యులతో సమ్మేళనమందునట్లు చేసెను. ఆర్యనాగ జాతుల సమ్మేళనకు ఫలితముగ మహాత్ముఁడగు బుద్ధుఁడవత రించి యహింసాధర్మమును బ్రపంచమున స్థిరముగ స్థాపించెను. అహింసాధర్మము మూలముగా లోకమునకు మంగళము చేకూరినది.

వశిష్ఠుని యహింసావ్రతమును, ఉదంకుని యాత్మ త్యాగమును, బుద్ధుని ధర్మస్థాపనయుఁ గారణములై లోకము నుద్ధరించినవి.

సంపూర్ణము

# అనుబంధములు



| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 మృత్యురంగిణి | 0 | 12 | 0 | 12 కాలసర్పి | 1 | 0 | 0 |
| †2 అభాగిని | 0 | 12 | 0 | *13 భారతకథాసారం | 1 | 0 | 0 |
| 3 ఛద్మవేషి | 0 | 12 | 0 | 14 కథాకల్పవల్లి (చిన్నకథలు) | 1 | 0 | 0 |
| *4 విదురుని యుపదేశములు | 1 | 0 | 0 | 15 ఆరక్షణీయము | 1 | 0 | 0 |
| *5 కాంచనమాల | 1 | 0 | 0 | *16 మాధవి | 0 | 12 | 0 |
| †6 సీమంతిని | 1 | 0 | 0 | †17 లలిత | 1 | 0 | 0 |
| *7 సుశీల | 1 | 0 | 0 | †18 పెండ్లిదంపె | 1 | 0 | 0 |
| 8 శశిరేఖ | 1 | 0 | 0 | 19 కథాకళి | 1 | 0 | 0 |
| *9 యమునాబాయి | 1 | 0 | 0 | 20 నాలుగుకథలు | 1 | 0 | 0 |
| †10 శ్యామల | 1 | 0 | 0 | 21 నీతిప్రబోధిక | 1 | 0 | 0 |
| 11 కాంతంకథలు (చిన్నకథలు) | 1 | 0 | 0 | 22 ఆదర్శము 1వ భా | 0 | 12 | 0 |
| | | | | 23 క్షేత్రాళికథలు | 0 | 12 | 0 |

పోస్టేజీ పైగా భరించవలెను.



# నాటకములు



| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| †1 మార్కండేయ నాటకము | 0 | 12 | 0 | 5 షాజహాను | 1 | 0 | 0 |
| †2 అహల్యాశాప విమోచనము | 0 | 12 | 0 | 6 నూర్జహాను | 1 | 0 | 0 |
| 3 మీవారుపతనము | 1 | 0 | 0 | 7 దుర్గాదాసు | 1 | 0 | 0 |
| 4 వరమాల | 1 | 0 | 0 | 8 చంద్రగుప్త | 1 | 0 | 0 |
| | | | | †9 దంపతులు | 1 | 0 | 0 |
| | | | | 10 విజయవిజయం | 1 | 0 | 0 |
| | | | | 11 భక్తకుచేల | 1 | 0 | 0 |

* Approved by M. T. B. C. for School use
† ... ... for Libraries



# సరస్వతీ పవర్ ప్రెస్

## రాజమహేంద్రవరము

---

ఈముద్రాయంత్రము భాషాగ్రంథములు తెలుగు—సంస్కృతము—అరవము—ఇంగ్లీషు భాషలలో ముద్రింపఁ దలఁచువారికి మిక్కిలి యనువుగ నుండును. ఇందు పుస్తకములు చక్కఁగ సంస్కరించు పండితులు గలరు. మిక్కిలి చక్కఁగా ముద్రింపఁ దలఁచువా రందఱు నీముద్రాయంత్రమునఁ దమగ్రంథములు ముద్రించుట మంచిది. మఱియు నితరములగు నచ్చుపను లన్నియు నిందు మిక్కిలి బాగుగఁ జేయఁబడును. అన్నిరకముల అచ్చుపనులు, ఎంగ్రేవింగుపనులు, బైండింగుపనులు మిక్కిలి సుందరముగాఁ జేయఁబడును.

విశేషాంశములు తెలిసికొనగోరువారు :—

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారు
సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము.

అని వ్రాయనగున

---

Printed by A. Lakshmanaswamy Naidu
at the Saraswathi Power Press, Rajahmundry. 8977-34.